


# చిదంబర ప్రణీతము.

పబ్లిషర్సు :

కంయుల గోవిందము,
జనరల్ బుక్ డిపో, బెజవాడ.

**PRINTED AT SCAPE & CO., COCANADA.**
**1926.**

 *[Price As. 12*

# సంగీత ప్రహ్లాద

[గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు]

ఈగ్రంథమును రచించినకవిగారు "స్వరాజ్యరథా"ది బహు నాటకములను రచించికీర్తిగన్నవారు. వీరికవిత్వము ద్రాక్ష అందుముఖ్యముగ నీనాటకమత్యంతాద్భుతముగ వ్రాయ భాగవతమునందలి "మందారమకరంద" అనుపద్యములో న గనుండు ననేకపద్యము లీపుస్తకమునందున్నవి. సంగీతప్రహ్లా టచేతనే యిందు రమ్యములగు ననేక పాటలుగలవని యూహింప. సనకసనందనాదులవలన విష్ణుద్వారపాలకులగు జయవిజయుల ముగిలుగుటయు" వారు హిరణ్యకశ్యపహిరణ్యాక్షదానవులై గుటయు శ్రీవిష్ణుయజ్ఞవరాహరూపమున హిరణ్యాక్షుని రూ టయు తద్విచారమున హిరణ్యకశ్యపుడు విష్ణుని సాధింప తపంబ టయు, బ్రహ్మవరంబులిచ్చుట, ...కోసి నింద్రుడు లీలావతి పట్టుట, నారదుడువిడిపించి తన యాశ్రమంబునకుగొని చని విష్ణు సేయు గర్భస్థుడగు ప్రహ్లాదునకీనుట, ప్రహ్లాదుని బాల్యము, త్రికి హిరణ్యకశ్యపు డాగ్రహించి వాని విష్ణుభక్తిమానుటకు మర్కులకడ చదివించుట, "ఎంతచెప్పిన విష్ణుభక్తిమానని ప్రహ్ల హిరణ్యకశ్యపుడు కొండలద్రోయించి, సాగరములముంచి, యగ డవేసి, పాములగరపించి విషమిప్పించి, యనేకబాధలంబెట్టుట" ప్రహ్లాదు ననేకవిధముల రక్షించుట, విష్ణుభక్తిమహాత్మ్యము తెరవలెను. విష్ణువెందుండుగానక విసిగివేసరి హిరణ్యకశ్యపుడు తు కుమారుని విష్ణుడెందున్నాడనినాతని నడుగుట, ప్రహ్లాదుడు, ఆ గలడందులేడను సందేహమువలదు; చక్రి సర్వోపగతుం డనియు మీరాయు హిరణ్యకశ్యపుడు హరియిందుగలడాయని సభాస్తంభమ గొట్ట శ్రీహరి నృసింహావతారధారియై స్తంభమునుండి వెడలి హిరణ్యకశ్యపుని వక్షముంజీల్చి సంహరించుట, (మహాభయంకరర ము) గ్రంథమంతయు రౌద్రభక్తిరసముల చక్కని మేళనమైయున్న కొలదిప్రతులుగలవు. త్వరపడవలెను. వెల 0—12—

వలయువారు— కంమల గోవిందం,

జనరల్ బుక్కుడిపో బెజవాడ

# కృష్ణతులా

చిదంబరప్రణీతము.

ప్రకాశకర్త,

కంపుల గోవిందసు

జనరల్ బుక్ డిపో, బెజవాడ.



మొదటికూర్పు 1000, ప్రతులు

స్కేప్ అండుకో., కె. సుబ్బారాయ సోదరులచే

ముద్రింపఁబడియె.

1 9 2 6.

 [0—12—0.

# పాత్రములు.

## పురుషులు.

సూత్రధారుఁడు.

శ్రీకృష్ణుఁడు.

నారదుఁడు.

గర్గమహర్షి.

సభ్యులు.

వసంతకుఁడు.

## స్త్రీలు

సత్యభామ.

రుక్మిణి.

లక్షణ.

జాంబవతి.

మిత్రవింద.

భద్ర.

కాళింది.

నాగ్నజితి.



# నాటకకథాసంగ్రహము.

—:ప్రథమాంకము:—

శ్రీకృష్ణుఁడు రుక్మిణితో నుద్యానవనమున విహరించుచుండఁగా నారదమహర్షి దేవలోకమునుండి వచ్చి కృష్ణునకుఁ బారిజాతకుసుమ మిచ్చుట. కృష్ణుఁడు దానిని స్వీకరించి రుక్మిణి కేశపాశమున ముడుచుట.

—:ద్వితీయాంకము:—

సత్యభామ కమలవలన నావృత్తాంతమువిని మనస్తాపమంతరంగమున నిముడ్చుకొని భర్తృవశీకరణోపాయమును గూర్చి కమలతో యోజించుచుండఁగా నారదమహర్షి వచ్చి ఆకర్షణవ్రతముఁ జేయుమని యుపదేశించియేగుట.

—:తృతీయాంకము:—

సత్యభామ కృష్ణున కుపచారములు గావించి యాతని నావ్రతమున కంగీకరింపఁజేయుట.

—:చతుర్థాంకము:—

సత్యభామ కృష్ణునితోఁ గూడి ఆకర్షణవ్రతముఁ గావించి కృష్ణుని నారదమహర్షికి దానమిచ్చుట. నారదుఁడు కృష్ణుని స్వీకరించుట. సత్యభామ భర్తమెత్తు ద్రవ్యము తూఁచి నారదున కీయలేక యుద్విగ్నమానసయగుట.

పంచమాంకము.—

సత్యభామ తనతోడి కోడండ్రద్రవ్యమంతయుఁ దెచ్చియుఁదుల తూఁపలేక తుదకు నారద ప్రబోధమువలన రుక్మిణీ దేవి కాళ్లపైఁ బడుట. తులసీ పూజఁగావించుకొనుచుండెడి రుక్మిణీమహాదేవి వెంటనే వచ్చి భక్తిభావముతో నొక్కతులసీ దళముధటపైనుంచి శ్రీకృష్ణునితో సరిగా తూఁచుట. నారదుఁ డాతులసీదళముం దీసికొని కృష్ణుని వారి కొప్పగించియేగుట. జయధ్వనులు. పుష్పవర్షము. మంగళము.





# శ్రీకృష్ణతులాభారము.

## ప్రథమాంకము

### నాంది

శా. లోకాతీతచరిత్రుఁడాత్మకలనాలోకైకసాధ్యుండు నా
నాకారుండు విచిత్రవర్తనుఁడు దుర్వ్యామోహవిధ్వంసి వి
శ్వైకత్రాణపరాయణుండఖిలమాయాసూత్రధారుండు మా
శ్రీకృష్ణుండు పరాత్పరుండు భువనక్షేమంబుఁ జేకూర్చుతన్.

(సూత్రధారుఁడు ప్రవేశించి పుష్పాంజలింజల్లి)

సూత్ర—రసికులగు సామాజికులు నవీనరూపక ప్రయోగసం
దర్శనకుతూహల త్వరమాణమానసులై జలధర ప్రాదుర్భావమునకుఁ
జాతకమునట్లు ప్రతీక్షించుచున్నారు. ఆహా! మా భాగ్యమేమి?
(తెరవైపుఁ జూచి) ప్రేయసీ! నైపథ్యమింకనుగాలేదా ?

నటి—ఆర్యపుత్రా! ఇదిగో వచ్చుచున్నాను. (ప్రవేశించి)
ఏమియాజ్ఞ.

సూత్ర—ఆర్యా! ఇది గొప్ప సమయము.

చ. నవనవభావ శోభనములన్ మదికింపొనరించి సభ్యసం
స్తవములకెల్లఁ బాత్రమయి తన్మయతన్ గలిగించి సోహమి
త్యవకలనప్రమోదరసమందున తేల్చెడి రూపకంబు నీ
యవసరమందు నాడవలదా? మనభారతశక్తి వెల్వడన్.

నటి—ఆర్యపుత్రా! ఈకాలమున విస్పష్టవర్ణపరిపాకదూరీకృతనిరాకృతోచ్చారణ సంప్రదాయప్రతిపదసందిగ్ధాక్షర వ్యక్తిప్రయుక్తాంగ్లేయభాషాగంధసమాఘ్రాణసముపలబ్ధనానాపశబ్దాలంకృతదోషసహస్రదూషితాసంస్కృతకతిపయసంస్కృతవాక్యసముపలబ్ధిమాత్రకృతార్థమ్మన్య రసజ్ఞమ్మన్య తృణీకృత బ్రహ్మలోకమ్మన్యతాది దురవస్థాసంక్షోభితాత్మీయప్రవర్తనావిదగ్ధులగు కవివిదగ్ధులలో నట్టిరూపకము రచియించెడి వారెవరుందురు? మనకట్టి రూపకరత్నము దుర్లభముగదా?

సూత్ర—ముగ్ధరాలా! నీవట్లనవలదు. ఈకాలమందుఁగూడ నుభయభాషావిశారదులగు కవిసార్వభౌములు లేకపోలేదు. వినుము నాకు శీఘ్రస్ఫురణకు వచ్చినవారిలో నొక్కరిని జెప్పెదను.

శా. కాళీప్రోదితసంస్కృతాంధ్రకవితాగంగావగాహుండు భూ
పాలశ్రేణిసభాబహూకృతి మహాభాగ్యైకపాత్రుండు నా
నాలంకారకలారసజ్ఞుఁ డవధానాగ్రేసరుం డుత్తమ
వ్యాలోలుండు చిదంబరుండనెడు విద్వన్మౌళి నాలింపవే?

నటి—నాథా! మఱచితి మఱచితి! ఆశుకవితావధానప్రదర్శనసమ్మోహితజగన్మండలుండగు నా కావ్యకలానిధి రచియించినరూపకమైనచో నది యభియుక్తోద్దీపకమగుటకు సంశయమేమి? దానినామ మేమి?

సూత్ర—

గీ. అబల! కృష్ణతులాభారమనెడు నొక్క
యాశుదృశ్యప్రబంధమ్ము నాదిమొదల
సల్పఁబడియున్న దా కవీశ్వరునిచేత
దాని నేఁడు ప్రదర్శింపఁ దలఁచినాఁడ.

నటి—ఆర్యా! మనభరతవిద్యావైదుష్యము నేఁటికిఁ గృతార్థమైనది.

సూత్ర—కలికీ! ఇదియే మనకు సుముహూర్తము. అంబరతలమునుండి గీతము వినవచ్చుచున్నయది. అనంతరకరణీయమునకు సంసిద్ధులము గావలయు రమ్ము

(నిష్క్రమించుచున్నారు)

— ప్రస్తావన —

---

నారదుఁడు—(ప్రవేశించి)

—§ గేయము §—

చేయకురా మతిహీన! ధనార్జన
చేయుము రా నీమతిని నిరార్జన
స్వీయకర్మ సంప్రాప్తఫలంబునఁ
జిత్తములోఁ బలుఁ దృప్తింగనరా॥
భజియింపుమురా గోవిందునిమది
భజియింపుమురా మూఢమతీ!
మించుబోండ్ల కుచనాభిదేశములు
గాంచి మోహమున మున్గకురా
ఎంచఁగనయ్యవి మాంసవికారము
లంచు మతిమ్మఁతి యోజింపుమురా॥ భజి
సారసదళమునఁ గదలెడు నీరము
తీరున జీవిత మతిచపలము రా
ఘోరవ్యాధ్యభిమానగ్రస్తా
కారము లోకము శోకహతము రా॥ భజి॥
ఎంతవఱకు నీవార్జించెదవో
యంతవఱకె నిన్నాసింతురు రా
శాంత శరీరపటుత్వము దగ్గిన
నంత నింట నిన్నడుగుదురా?॥ భజి॥

దేహాశ్వాసములుండెడివఱకే
గేహములోఁ గుశలంబుగును రా
దేహములోపలి వాయువుపోయిన
దీనిఁజూచి పెండ్లముభయపడు రా॥ భజ ॥

ఆహా ! యీపారిజాతపుష్ప మెంతమనోహరముగానున్నది. ౘ
న్నమాగులు చూచినను తనివిదీఱకున్నయది. ఆఘ్రాణించిన కొలంది
యీ నవనవపరిమళపరంపర లెగఁజిమ్ముచున్నయది. ఇది శ్రీకృష్ణునక
ర్పించి నేనుతరించెద. తరుణీభోగపరాయణుండగు నామహాపురుషునకీ
పుష్పమానందముఁగలగించినట్లు నాకోఁటిజడదారికప్రమోదావహము
కానేరదు. స్వర్ణఖచితమైనరత్నము ప్రకాశించి నట్లు స్మృత్పిండనిహా
తమైన రత్నముప్రకాశించునా? ఇదిగో శ్రీకృష్ణుఁడు రుక్మిణీసమేతుఁడై
మాధవీలతాజుష్టమగు రసాలంబుచెంతఁబున కనులకు విందొనరించుచు
న్నాఁడు. త్వరితముగా నేనచ్చటికేగవలయు.

(ప్రవేశించుచున్నాఁడు.)

## —॥ ఆ రా మ ము ॥—



(రుక్మిణియు శ్రీకృష్ణుఁడు ప్రవేశింతురు)

కృష్ణ—రుక్మిణీ! ఇదిగో యీమ్రాకుశాఖనము నీవీక్షణంబులకు జంకి యెంతజవంబునఁ బరుగిడుచున్నదో కాంచితివా?

రుక్మి—నాథా! నావీక్షణములకట్టి సామర్థ్యములేదుగాని భవద్భ్రుకుటిధనుఃపరిత్రస్తమై పరుగిడుచున్నట్లు గనుపట్టుచున్నది.

కృష్ణ—ప్రాణేశ్వరీ! ఈపరిహాసవచనంబులకేమిగాని యీమరాళమునకు గమనవిలాసము నీవు నేర్పితివా? నీకే మరాళము నేర్పినదా? నిజము చెప్పుము.

రుక్మి—కృష్ణా! సర్వాంతర్యామివగు నీకుఁ దెలియవలసినదిగాని ముగ్ధురాలనగు నేనెట్లు దెలియనేర్తును.

కృష్ణ—కాంతా! యీమల్లికాకుసుమములెంత హృదయంగమముగానున్నయవి. కోసియిత్తునా?

రుక్మి—ప్రాణేశ్వరా! మీకు శ్రమము వలదు యీరీశిలాఫలకముపైఁగూర్చుండుఁడు. నేను గోసికొనివచ్చెద. (పరిక్రమించి పువ్వులఁ గోయుచుండును.)

కృష్ణ—(రుక్మిణి వంకఁజూచుచు)ఆహా!

ఉ. ఎందఱుభార్యలుండినను నీసుదతీమణియట్లు నన్నునా
నందరసాబ్ధిఁదేల్పఁ గల నాతిమఱొక్కతె లేదు లేదు నా
డెందము భక్తిపాశము ఘటించినలోఁబడినట్టు లందముల్
చందములెన్నిజూపినను స్థైర్యముఁబాయఁగఁ బోవఁదెన్నఁడున్.

(శ్రవణమభినయించి) ఏమియీగానమాధుర్యము. (పైనఁజూచి)

మ. అది యేమో ? యొక కాంతిపిండమయినట్లాకాశ భాగంబునుం

డి దిగఁ జాఱుచునుండె

(విమర్శించిచూచి) దేహమను సందేహంబుజన్మించె

(విమర్శించిచూచి) అ

ల్లదిగో పూరుషుఁడట్లు దోఁచె నెవఁడో ?

(విమర్శించిచూచి) అస్మత్తపోభాగ్యమ

భ్యుదయంబందిన రీతి నారదుఁడెదేమో?యిట్టులే తెంచెడిన్.

కాంతామణీ! రుక్మిణీ! మనకు భాగ్యోదయమబ్బినది రమ్ము.

రుక్మి—(వచ్చి) నాథా! యేమి?

కృష్ణ—ఇదిగో వ్యోమాంగణమునుండి నారదమహర్షి వచ్చు

చున్నాఁడు.

రుక్మి—ఆమహాత్ముఁడు స్వర్గలోకమునుండి వచ్చుచున్నట్లు

న్నది.

కృష్ణ—ఆసంగతి పారిజాతకుసుమఘుమఘుమార్భటులే చెప్ప

క చెప్పుచున్నవి.

రుక్మి—నాథా ! గోవిందనామ సంకీర్తనముచే నామహానుభా

వుఁ డొదలు మఱచి వచ్చుచున్నాఁడు. నీభక్తిచే నిట్లే మహాత్ములెల్లరు

ముక్తాత్ములగుచుందురు.

కృష్ణ—రుక్మిణీ! నాభక్తినంతగా నుగ్గడించెద వేమి? దాని

ప్రభావము నీకేమి తెలియును ?

రుక్మి—

సీ. భూతపంచకసముద్భూత శోకమునుండి

తొలఁగుట నీభక్తివలనఁగాదె

సంసారబంధంబు సడలించుకొని నిరా
కులులౌట నీభక్తివలనఁగాదె
పారిపోరి మేనులు మఱచి బ్రహ్మానంద
పరులౌట నీభక్తివలనఁగాదె
అణిమాదిసిద్ధుల కాధారభూతులై
వెలయుట నీభక్తివలనఁగాదె
గీ. పరమపావనమైన నీభక్తివలన
కానికార్యంబు లేపియుఁ గానరావు
నిర్వికారహృదాస్వాద్య నిగమవేద్య
సచ్చిదానందరూప! విశ్వప్రదీప!

నార—(అంబరమునుండి దిగుచు)

— గేయము —

అర్థమనర్థంబని తెలియుము రా
వ్యర్థముఁ రా సుఖమేమున్నదిరా?
అర్థవంతులకుఁ బుత్రుఁడు గూడ న
నర్థకరుండగునట్లగపడు రా॥ భజ॥
బాలుండాటలు పాటలు గోరున్
లీలావతులన్ దరుణుఁడు గోరున్
కూలున్ ముదుసలి వ్యసనములోఁజాల్
చాలుఁబరబ్రహ్మంబెవనికి రా?॥ భజ॥
జాయ యెవతె రా? సుతుఁడెవ్వఁడు రా?
సంసారంబిది బహుచిత్రము రా
ఈమొదకట్టీ వేతెంచితివో?
యెవరివాఁడవో? యిది తెలియుము రా॥ భజ॥

సత్సంగత్వము సమకూరినచో
సర్వము నిస్సంగత్వము రా
నిస్సంగత్వము గలిగినపిమ్మట
నిర్మోహత్వమునిత్యము రా। భజ।
నిర్మోహత్వము సంప్రాప్తించిన
నిశ్చలతత్త్వము సిద్ధము రా
నిశ్చలతత్త్వము సిద్ధించినచో
నిజముగ జీవన్ముక్తియె రా। భజ।

కృష్ణ—మహాత్మా ప్రణామము
రుక్మి—దేవా! నమస్కారము.
నార—(కనులుమూసికొని నాట్యము చేయుచు)

— గేయము —

కారుకోడెవసమాజినపిమ్మట
కామవికారము లెక్కడరా?
నీరము లేకుండిన పిమ్మట కా
సారవిలాసం బెక్కడరా? భజ।
ద్రవ్యముసర్వము పోయినపిమ్మట
తనపరివారం బెక్కడరా?
అవ్యయమార్గం బెఱిగినపిమ్మట
హా!! సంసారం బెక్కడరా? ।భజ।
సాయంబుదయము రాతిరిపవలు వ
సంతశిశిరములు నివియవియే రా
ఆయువు పోయెడిఁగాలం బాడెడి
నాశాబంధము లూడవురా। భజ।

కృష్ణ—మహాత్మా! ప్రణామము.

నార—(కనులు తెఱచి) ఓహోహో కృష్ణభగవానులా? ధన్యుఁడనైతి ధన్యుఁడనైతి. దేవా! వాసుదేవా! భవన్నామామృతపానవివశీకృతేంద్రియుండనై నిన్నుఁగూడ తెలిసికొనఁజాలకపోతిని. ఆహా! గోవిందనామసంకీర్తనామృతమాధుర్యముకంటెను తుచ్ఛములగు ద్రాక్షాదిమాధుర్యము లెంతటివి (కనులుమూసికొని) ఆహా! యెంతసుఖామృతాబ్ధిలో నోలలాడుచుంటిని (కనులు తెఱచి) దేవా! పురుషోత్తమా! ఇదిగో నాయుపాయనముగైకొనుము (పారిజాతపుష్పము నిచ్చుచున్నాఁడు.)

కృష్ణ—మహాప్రసాదము (తీసికొని) కాంతామణీ! నీకీపుష్పము తగియున్నది.

నార—ముమ్మాటికి తగియున్నది.

కృష్ణ—రుక్మిణీ! దీనివిశేషములు నీకుఁదెలియనివికావు. నీవేల పరాఙ్ముఖురాలవయ్యెదవు? నీతురుమున నేనే యీకుసుమము నలంకరించెద నిటురమ్ము.

రుక్మి—నాథా! నీవనుగ్రహముచే నొసంగునదియే నాకు పరమప్రసాదము. కాని సత్యభామకీవార్తదెలిసినచో నేమియపాయము కలుగునోయని నాహృదయము శంకించుచున్నయది.

కృష్ణ—కలికీ! నాపట్టమహిషివగు నీకుఁదప్ప నీకుసుమమన్యులకుఁ దగదు. నీవింక శంకింపఁబనిలేదు. (కేశపాశముపై నలంకరించుచున్నాఁడు)

కమల—(పటాక్షేపముసఁ బ్రవేశించి) (స్వగతము) ఏమీ; యీకృష్ణుఁడెంతమాయావి, వీనినినమ్మికొని యమాయకురాలగుమాన

త్యభామ యుఱియులేక చచ్చిపోవుచున్నది. ఇతఁడిట్టివాఁడని నే నెన్నఁడు నుతలంపలేదు. సత్యభామాగృహమున కీతఁడు వచ్చునపు డెల్ల మార్జాలమువలె మెల్లమెల్లగా నడుగిడుకొనుచు మహాసౌజన్య నిధివలె నపరాధమన్న నెట్టిదో యెఱుంగనివాఁడువలె కనఁబడుచుండెడి వాఁడు. ఈతఁడింతటి పయోముఖ విషకుంభమని మాకుఁ దెలియదు. పాపము మాసత్యభామ యీతఁడిట్టి గోముఖవ్యాఘ్రమనియు తృణచ్ఛన్నకూపమనియు నెఱుంగక యెంతకాలమునుండి వీనితోఁ గాఁపురముఁ జేయుచున్నది. ఇట్టిపురుషులే కదా లోకవంచకులు. ఆపుష్పవాసనయెంతదూరము వ్యాపించుచున్నది. ఆకుసుమ మెంతమనోహరముగానున్నది. దానికాంతులు పూర్ణచంద్రుని కిరణములువలె వ్యాపించి రుక్మిణీకేశపాశము నెల్ల వికసింపఁ జేయుచున్నవి. కృష్ణుఁ డాపుష్పసన్నిధానమున నుండుటచేఁ గాఁబోలు సితాంభోజమువలెఁ గన్పట్టుచున్నాఁడు. ఇది మనుష్యలోకములోని పుష్పము కాదు. లోకసంచారియగు నారదమహర్షి దేవలోకమునుండి దీనిం దీసికొనివచ్చి కృష్ణునకిచ్చి యుండనోపు. దానిచే నతఁడు తనప్రాణకాంతయగు నీరుక్మిణి నలంకరించుచున్నాఁడు. ఇది నాకనులతోఁ జూడఁజాల, మున్నాటికిఁ జూడఁజాల. కాని నాకృత్యము నేను నెఱవేర్చికొనకుండఁ బోవుటభావ్యము కాదు. (సమీపించి) స్వామీ! రుక్మిణీమనోహరా! అమాయకురాలగు మాసత్యభామ నీరాకకెదురు జూచుచున్నది. నాకు సెలవిమ్ము. నేనేగెద.

కృష్ణ—(కపటహాసముతో) కమలా! యెప్పుడువచ్చితివి?

కమల—నీవు రుక్మిణీదేవి కేశపాశమునఁ గుసుమము నలంకరించుచున్నప్పుడే వచ్చితిని.

కృష్ణ—(స్వగతము) దీనికసూయ లోపల నిమిడియుండుటచే తనే రుక్మిణీమనోహరా! యని నన్ను సంబోధించినది. నాయికామణుల యందు దాసీజనమున కెంతయభిమానము? (జనాంతికము) కమలా,

నేనిప్పుడే యక్కడికిరావలెనని ప్రయాణమగుచుంటిని. అంతలో పూజ్యపాదులగు వీరు దయచేయుటచే నంతరాయమైనది. ఇదిగో నీవా నువెంటనే వచ్చుచున్నాను. పదపద.

కమల—చూడఁదగినదంతయుఁ జూచితిని. ఇఁక నాకిక్కడనేమి పని. (నిష్క్రమించుచున్నది.)

నార—కృష్ణా! నీదర్శనమున కృతార్థుఁడనైతి. నేనింక దేవలోకమున కేగవలయు.

కృష్ణ—చిత్తము మహాత్మా!

నార—(గేయము)

మఱిమఱిపుట్టుట మఱిమఱిగిట్టుట
మఱిమఱి జననీకుక్షింబోరలుట
దరిగనఁబడదీ సంసారమునకు
దారిఁజూపరా శౌరి! మురారీ! భజ॥

(నిష్క్రమించును)

రుక్మి—నాథా! యింతవఱకు నీవిందే యాలస్యము చేయుటచే మానవతియగు సత్యభామ కేమియాగ్రహముకలుగునో శీఘ్రముగా నామెనుగూడ సంతసింపఁజేసిరమ్ము.

కృష్ణ—మంచిది.

(అందఱు నిష్క్రమింతురు.)

ప్ర థ మాం క ము.





# శ్రీకృష్ణతులాభారము

## ద్వితీయాంకము.

### సత్యభామామందిరము.

సత్యభామ—(శయ్యపైఁబవళించి) నాప్రాణేశ్వరుఁడింకను రాకుండుటకుఁ గారణమేమి ? కృష్ణుఁడు రుక్మిణీ మందిరమున నున్నాఁడో లేఁడో ? ఒకక్షణమైనను నన్నుఁబాయకుండెడివాఁడు. నాగీచిన గీటుదాఁటకుండెడివాఁడు. నాప్రాణనాథుఁడు. నావిధేయుఁడు వచ్చుచునేయుండవచ్చును! సమాకర్షణమంత్రమైన మదీయసౌందర్యవాగురాపాశంబునఁ జిక్కిన కృష్ణహరిణమెక్కడికిఁ దప్పించుకొని పోఁగలదు? కమలగూడ నింతయాలస్యముఁ జేసినదే. కారణమేమియుఁ గనుపట్టకున్నది.

కమల—(ప్రవేశించి) అమ్మా! సత్యభామా! నీవంటి యమాయకురాలగు పడఁతి నాకెక్కడను గనఁబడలేదమ్మా !

సత్య—(లేచి) కమలా ! నాప్రియుఁడు వచ్చుచున్నాఁడా ? నాకాంతుఁడెక్కడ నున్నాఁడు? రుక్మిణీమందిరమున లేఁడా ? నీవేల వెంటబెట్టుకొని రాకపోయితివి? కమలా! యేమియూరకుండెదవు? సత్యభామకడకు రానన్నాఁడా ? అతఁడు ప్రేమించుటకు సత్యభామకన్న మిన్నయగు సౌందర్యవతి లోకంబున నెవ్వతెయున్నది ?

కమ—ఈమోహావేశముచేతనే నీవగౌరవమునకుఁ బాత్రురాలవగుచున్నావు. ఇట్టిపిచ్చివలపులునీవంటియమాయకురాండ్రకున్నను పురుషులకెన్నఁటికి నుండవు. అందునను మాయావియైన కృష్ణునకెన్నఁడును నుండవు.

సత్య—కమలా! యేమేయల్లుచున్నావు? కృష్ణుఁడు నన్నేమేనియనాదరణచేసెనా?

కమ—పిచ్చిదానా! నీకెంతకన్నఁ జేయవలసిన యనాదరణమేమున్నది? నేనుగూడ చూచి సహింపలేకపోతిని. అప్పటికిని మొదటఁబడి కొంత నాయుడుకు జల్లార్చికొంటిని.

సత్య—సఖీ! యేమిజరిగినదే? కృష్ణుఁడేయట్లు చేసెనా?

కమ—ఏదిమనకు సుఖాస్పదమని తలఁచుచుందుమో యదియేమనకు దుఃఖప్రదమగును. లోకబాంధవుండై యుదయించెడి దివాకరుండాకాశమధ్యగతుండై సంతాపకరుండగుచున్నాఁడు. జగదానందకరుండగు సుధాకరుండు వియోగావస్థయందు మనకతఁడే ప్రాణహారుండగుచున్నాఁడు.

సత్య—కమలా! నీవు చెప్పినమాటలో నసత్యములేదుగాని కృష్ణుని విషయమున నీయనుమానములు సమన్వయింపవని నేను దృఢముగాఁ జెప్పఁగలను.

కమ—దృఢముగాఁ జెప్పఁగలవా? అట్లైన జగన్మోహనమైన పారిజాతకుసుమమును కృష్ణుఁడు నీకీయక రుక్మిణికేల పాలమునసే స్వయముగా నేల ముడుచును?

సత్య—(కోపముతో) ఆ!! కృష్ణుఁడే యింతపనిఁ జేసెనా? కమలా! పారిజాతకుసుమమెక్కడిది?

కమ—దేవలోకమునుండి నారదమహర్షితీసికొనివచ్చి యిచ్చి నట్లున్నదమ్మా ?

సత్య—నారదమహర్షి యక్కడనే యున్నాఁడా?

కమ—శిరమునందు గణాధిపతివలెఁ గూర్చుండి యున్నాఁడు.

సత్య—కృష్ణా ? నీ కుహనాపవర్తనమును జూచి నేను వెరా సపోవుచుంటి· ఇట్టివాఁడవైతివా? కానిమ్ము? నాయింట నింక నేమొగ మున నడుగుబెట్టెదవో చూచెదఁగాక; కమలా! నాకడ కాధూర్తుఁడు వచ్చునా? రాఁడా?

కమ—ఇదిగో యిప్పుడే వచ్చుచున్నానని చెప్పినాఁడు.

సత్య—కమలా నాకేమియుఁ దోఁచకున్నది. నీవు నాయొద్దనే యుండుము (ఆకాశముకలతిలకించి) హా! మాయావీ సుందరీశిరోమణి యగు నీసత్యభామ నీకంటి కంతచులుకనగాఁ గనుపట్టినదా ? కురూ పిణియగు రుక్మిణి నీకువలపుఁగత్తె యయ్యెనా ? ఔను. వారిణమునకు గహనము రుచించినట్లు మనోహరమైన పురము రుచించునా ? కాని మ్ము; నీవింక నాయెదుటికెట్లు వచ్చెదవు. నీరూపసంపదలకు నేను దగి యుండలేదు గాఁబోలు? ఔను. కపోతమునకు రాజహంసియెట్లుదగియుం డును? (నిట్టూర్పుతో) ఓమహర్షీ! నారదా! విశ్వపరిజ్ఞాతవైన నీవచ్చుట నుండియేనా యింతపనిఁజేయించితివి? రూపవతీశిరోమణియగు సా త్రాజితిబ్రతికి యున్నదనియైనను నీవెఱుఁగవా ? ఆపుష్పము మోహా వేశపరవశుఁడై కృష్ణుఁడా కురూపిణికేశపాశమున నలంకరించుచుండఁ గా దీనికి సత్యభామతప్ప నీకురూపిణితగదని నివారించుటకు నీకు నోరులేక పోయెనా ? కాని నిచ్చలు వచ్చుచుండెడి నీవు మాయూప రేఖా విలాసతారతమ్యమెఱుఁగనివాఁడవా ? నాకుఁ దప్ప నన్యుల కాపుష్పమర్హము కాదని నీవెఱుంగవా ? తపోనిధివగు నీకింతమాత్ర ము తెలివిలేకపోయెనా ? పోనిమ్ము; విరాగివైన నీకుఁ దెలియకపో

యినఁ బోవుఁగాక; అచ్యుతా ! అపూర్వముఁజూచి నంతమాత్రమున సత్యభామాగాత్రివల్లి స్త్రీకుజ ప్రీతిలోనికి రాకపోయినందుకు శోకింపవల సియున్నది. అదియేమైన స్త్రీకు మందుబెట్టినదా ? లేకున్న తృణమేని నాముఖపద్మము విస్మరింపసి సికట్టి పుష్పసందర్శనసమయమునఁగూడ కుసుమసుకుమారిణియగు నీజగన్మోహిని స్మృతికైన రాకుండునా ? నేనెంతమందభాగ్యురాల? నానాథుఁడింక నాకెట్లువశముగాఁగలఁడు.? అయ్యో! యతనియం దేమియుఁ దప్పులేదు. కురూపిణియగు రుక్మిణియే దిదియో మోసముఁ జేయుకున్న -నింతయనర్థము గలుగనేరదు. ఇఁక నేను చేయవలసినదేమున్నది. నాకింక భర్తృవశీకరణమెట్లుకాఁ గలదు? భర్తృసాన్నిధ్యము లేనికడఁతి సౌందర్యమంతయు నడవిఁగాసిన వెన్నెలయే గదా ? కమలా ! భర్తృవశీకరణమున కేమైన నుపాయ ములున్నవా ?

కమ—లేకపోలేదు ఇప్పుడు కొందఱు స్త్రీలు భర్తలను వశ పఱచుకొనవలెనని భక్ష్యభోజ్యపానీయములలోఁ గలిపి కొన్ని మందు లిచ్చుచుందురు. కాని తుట్టతుదకామందులవలన భర్తకు పిచ్చిపట్టు టయో, తెలివిలేకపోవుటయో, నపుంసకుఁడగుటయో, పరమశత్రువ గుటయో, మరణించుటయో, వీనిలో నేదియో యొకటి తటస్థింప కమానదు.

సత్య—(భయముతో) కమలా ! అట్టిమందుల నంగ[illegible] వలదమ్మా? మఱి యే యుపాయములైన నున్నఁజెప్పుము.

కమ—అమ్మా ! యెవరైన మహాయోగులు తటస్థించి [illegible] దైన నుపదేశించినచోఁ గార్యసిద్ధిగావలసినదే కాని తదితరోపా[illegible] లేమియు పనికిరానివి.

సత్య—కమలా! నానాథుఁడు వచ్చుచున్నాఁడేమో ద్వారః కడకేగి చూచిరమ్ము.

కమ—చిత్తము (నిష్క్రమించి పచ్చి) అమ్మగారా లేదమ్మా!

సత్య—నిజముగా నన్ను మఱచినాఁడు. కమలా! నీవుచెప్పిన మందులవలన తెలివితక్కువకూడ యొకటి యున్నది గదా ? దానిమందువలన నానాథుని కాగుణమేమైన ప్రాప్తించినదేమో ? దైవమా ! నేవన్నివిధముల హతాశనైతి, తిరిగి నాకు ప్రాణేశ్వరాలింగన భాగ్యము చేకూరఁగలదా ?

కమ—అమ్మా ! తుచ్ఛరాండ్రు పెట్టవలసిన యామందు విజ్ఞానవతియగు రుక్మిణి పెట్టునా?

సత్య—పిచ్చిదానా! భర్తనువశీకరించుకొనవలెనను దురాశకింకదనిది మంచియని యిది చెడ్డయనితోఁచునా?

కమ—అమ్మా! యెవరోసాధువు వచ్చుచున్నట్లున్నది. గీతము వినఁబడుచున్నది,

సత్య—నాకుఁగూడ సునాడీ పరిస్పందమగుచున్నయది. వారివలన మనకేమైన నీవుచెప్పినట్లు శుభము కలుగునేమో?

నాగ—(ప్రవేశించి) గేయము

జనధనయౌవన మదమేటికిరా?
సర్వము కాలగృహీతమురా
కనుఁగొనిపకలంబిది మాయామయ
... ... బాసింపుమురా! ధు॥

సత్య—స్వామీ! ముని ... వాస్వాగతము స్వీకరించి రోవలయునని ప్రార్థించుచున్నదాన.

నార—(స్వగ) ఈసాత్రాజితికి తానే యాదవపతియనియు, తానే భర్తకునచ్చిన యర్ధాంగియనియుఁ బ్రబలమైనగర్వముగలదు. ఇదియే కాక మహాభక్తురాలగు రుక్మిణీదేవిమాటయనిన నీమెకింత లేనియుఁ

గిట్టదు. భగవంతుఁడు భక్తులకు వశుఁడైనట్లు యిట్టి దుర్గర్వీణులకు వశుఁడు కానేర్చునా? ఇప్పట్ల నారుక్మిణీమహాదేవి పరిభావ మీామెకుఁ గనంబఱచి యీామెగర్వభంగము గావింపవలసియున్నది. ఇందువలన నే నే నీమార్గమునఁ బ్రయాణము జేయవలసివచ్చినది. (ప్రకా) దేవీ! నాకు శీఘ్రముగా నేగవలసిన కార్యములున్నయవి నేనిచ్చట నాలస్యము చేయుటకు వీలు లేదు.

సత్యా—స్వామీ! యొకక్షణకాలము నన్నను గ్రహించి దయచేయవలయు.

నార—కానిమ్ము. క్షణకాలములోఁ బోవునదేమి? శ్రీకృష్ణభగవానుని ప్రియకాంతవగు నీమాట ద్రోసివేసిపోవుట మాబోఁటివారికి మర్యాదకాదు (నమీాపించి పీఠముపైఁగూర్చుండును)

సత్యా—మహాత్మా! నమస్కారము.

నార—కల్యాణీభవ కల్యాణీభవ

సత్యా—సకలదేశసంచారులగు మీాకుఁ దెలియని యంశమేదియు నుండదు. ముగ్ధురాలనగు నాకోర్కె నెఱవేర్చెడి సిద్ధమంత్రమేదేని నాకుపదేశించి పోవలయుమహాత్మా!

నార—మేము పరమార్థచింతనచేత లోకమునుద్ధరించుటకుఁ దిరుగుచున్నారము. మాకు దాఁచికొనవలసినదేమున్నది? నీకేమేని మనోరథమున్నయెడల నడుగుము మాచేతనైనంతవఱకు నుపకారము చేసిపోయెదము.

సత్యా—స్వామీ! భర్త వశుఁడు కానియెడలభార్యకుండు క్లేశము చెప్పరానిదిగదా?

నార—సాత్రాజితీ! స్వాధీనపతికవగు నీకట్టిక్లేశ మేమేనిచేకూరినదా యేమి?

సత్య—అందువలననే కార్యాంతరవ్యగ్రమనస్కులగు మీకిట్టి శ్రమమీయవలసి వచ్చినది.

నార—సాత్రాజితీ! యేవిధముచేతనేని పరోపకారమగు నేని మాకిదియొక శ్రమముగాదు. అట్లేని ప్రస్తుతము నీకు భర్తృవశీకరణోపాయము జెప్పవలయునా?

సత్య—మహాప్రసాదము.

నార—దానికొక వ్రతమున్నది. దానిని నీవు నెఱవేర్పఁగలవా?

సత్య—యుష్మదాజ్ఞానుసారముగా నెఱవేర్చుటకు సంసిద్ధురాలనై యున్నాను.

నార—నీవు రాజపుత్రివిముందే యోజించుకొనుము. ఆవ్రతము సాంగముగా నెఱవేర్చనెడలఁ బూనుకొనుము. లేని యెడల నూరకొనుము.

సత్య—స్వామీ! దాని పేరేమి?

నార—ఆకర్షణవ్రతము.

సత్య—భర్తనాకర్షించివశునిగాఁ జేయునదియా?

నార—ఔను. అదిమీవంటి యస్వాధీనపతికలగు సతివలకుఁగా నేర్పడినది.

సత్య—పరమోత్తమంబైన యీవ్రతముదప్పక నెఱవేర్చెద. స్వామీ! దీని నియమములేమి?

నార—సాత్రాజితీ! యీవ్రతమునొక్కనాఁడే కల్పోక్తవిధానముగా నాచరించి పిదప నొకదాన మీయవలయు నంతటితోనిది సమాప్తము కాఁగలదు.

సత్య—స్వామీ, యేమిదానమీయవలయు?

నార—భర్తృదానము.

సత్య—స్వామీ! యేమి యీచిత్రము. భర్తను దానమిచ్చిన

పిదప భర్తృవశీకరణమేమున్నది? నాభర్తకుఁ బ్రతిగృహీత ప్రభువుగాఁ గలఁడు కాని, నాకతని యందధికారమేమున్నది ?

నార—(స్వగ) దుర్గర్విణి ! భర్తపై నీకధికారము కావలయునా ? యెంతదురభిమానినివి నీకు గర్వభంగము గావింపకున్న నేనొక నారదుఁడనా? (ప్రకా) దానమున నేమనుకొంటివి?

సత్య—భర్తను మఱియొకరి కిచ్చివేయుటకాదా ?

నార—కాదు కాదు. ఇదియాకర్షణవ్రతదానము. అన్నిదానములవంటిది కాదు. భర్తను ముందు పాత్రుఁడగు నొక తపస్వికిదానము జేసిన పిదప ధనధాన్యవస్త్రభూషణాదులలో దేనినైనను బెసిమిటి యెత్తుసరిగాఁ దూచి యాతపస్వికర్పించిభర్తనుదానుస్వీకరింపవలయు. ఇంకజన్మమున్నంతవఱకా భర్తయాభార్యనెడఁబాయఁడు. ఇదియే దాని ఫలితము. నీకు సామర్థ్యమున్నచో భర్తను స్వాధీనునిఁ జేసికొమ్ము. లేనిచో నీమాట దలపెట్టకుము. ఉపాయాంతరములు కార్యబాధకములే కాని కార్యసాధకములు కానేరవు. నేనింక పోయివచ్చెద.

—(గేయము)—

దానధర్మములు వ్రతములుగంగా
స్నానములెన్నియుఁ జేసినఁగాని
జ్ఞానవిహీనుఁడు జన్మశతంబుల
కైనముక్తిఁ గనఁడిది సిద్ధము రా॥ భజ ॥

సత్య—కమలా! కృష్ణుఁడిచ్చటికివచ్చినచో నింతకుపూర్వముకన్న నిప్పుడత్యధికముగా మర్యాద జేయవలయు.

కమ—అమ్మా! రోషవతివగునీకుఁగూడ నింతశాంతికలుగుట కేమికారణము?

సత్య—సఖీ! అతనిం గలసి నేనీయాకర్షణవ్రతము నారదమహార్షి చెప్పినట్లు పరిపూర్తిఁ జేయవలసియున్నది. దానికి మొదటఁ గృష్ణుఁడొప్పుకొనవలసియున్నది. సామవాక్యములచే నాతనినిముందు ప్రసన్నునిగాఁ జేయవలసిన భారము మనయందున్నది వ్రతముసంపూర్ణమైనపిదపనతఁడే దాసానుదాసుఁడై యుండుఁగదా. కృష్ణుఁడువచ్చుచున్నాఁడేమో మరలఁజూచిరమ్మా.

కమ—చిత్తము. (నిష్క్రమించివచ్చి) అదిగో మకరందుని తోఁగూడ వచ్చుచున్నాఁడమ్మా.

సత్య—ఎంతదూరములోనున్నాఁడే ?

కమ—ఇదిగో మనద్వారములోనికి వచ్చినాఁడమ్మా.

సత్య—(ఆవేగముతో) నీవీకుసుమభాజనముం దీసికొమ్మా. నేనీకలశముందీసికొనివచ్చెద. నాథునికెదురేగి పూజించి తోడ్కొనిరావలయును.

కమ—అట్లేచేయుదము. (కుసుమభాజనముఁ బట్టుకొనును.)

(ఇరువురు నడతురు)

(కృష్ణుఁడు మకరందునితోఁ బ్రవేశించుచు)

కృష్ణు—(సత్యభామరాకను గమనించి పెద్దగా)

చ. అలికులవేణి నాసరసిజానన నారతినాలమూట నా
చిలుకలకొల్కి నాయమృతశేవధి నాప్రియకాంత నాసతీ
తిలకము నానిధానము ప్రతిక్షణమందును సత్యభామ కన్నులకెదురై పథంబును గనుంగొననీయదిదేమి మిత్రమా!

మక—మిత్రమా! ఆమెస్థితిచూడఁగా మనమిద్దఱముగూడ నీదినమున గొప్పయదృష్టవంతులమైతిమని తోఁచుచున్నది.

కృష్ణు—అదియట్లుండనిమ్ము యీసత్యభామ నేనువచ్చుచుండఁగా నీవిధముగ నెన్నఁడును నాకుఁగన్పట్టలేదు సుమా.

మక — కాలవైపరీత్యముగానున్నది.

సత్య — (సమీపించి కృష్ణుని పాదములం గడిగి నెత్తిఁ జల్లుకొని పాదములొత్తుచున్నది.)

మక — (జనాంతికముగా) కృష్ణా! ప్రియమేమైన సంప్రాప్తించునేమో యనినాకుఁ దోఁచుచున్నది.

కృష్ణ — వయస్యా! స్త్రీ చిత్తము బహుదురవగాహము. ఇది దేనికో పన్నాగము పన్నినట్లున్నది.

మక — కృష్ణా! యేపన్నాగమైన నాకేమి నాప్రాణములుదక్కినవి, అదియే నాకు సంతోషము.

సత్య — (కమల యందించెడిపుష్పములు కృష్ణుని చేతిలో నుంచును.)

కృష్ణ — (ఆలింగనముఁ జేసికొని) కల్యాణీ! నేనిచ్చుటకువచ్చుటకుఁ గొంచెముతడవైనది క్షమింపుము.

సత్య — నాథా! నేనిప్పుడేమైన నాగ్రహించితినా? మీరునన్నేల ప్రార్థింపవలసివచ్చినది?

మక — అమ్మా! నీవిప్పుడును జేసెడి మర్యాదలకు వ్యతిరేకముగా నిప్పటి మర్యాదలు కనఁబడుటచే విరియాగ్రహసూచకములైనమర్యాదలేమోయని మామిత్రుఁడు క్షమింపుమని నిన్నుఁ బ్రార్థింపవలసివచ్చినదియే కాని నీయందు వేఱొకయభిప్రాయముచేతఁగాదు.

సత్య — మకరందా! మిత్రపక్షమున సమర్థింపవచ్చితివా? అప్పటికన్న నిప్పుడు భిన్నమర్యాద లేమిజరిగినవి?

కృష్ణ — మకరందా! నోరెంతయణఁచినను నణఁగదుగదా!!

మక — మిత్రుఁడా! నీవునామాటలంతగా వినలేనిచో నానోటికొక తాళము వేయుము.

సత్య—నాథా! యీపుష్పశయ్యనలంకరింపుము

మక—కృష్ణా! మర్యాదలెక్కువ యగుచున్నయవి పొరబడి పోయెదవేమోయని నామనస్సుకొట్టుకొనుచున్నది.

కృష్ణ—మకరందా! నీవుగూడ నాసరసనేయుండుము (వరికి మించి పుష్పశయ్యపైఁ గూర్చుండును. మకరందుఁడు క్రిందఁ గూర్చుండును.)

సత్య—(కృష్ణునకుఁ దనవయ్యెదచే స్వేదబిందువులు దుడుచుచు వింజామరముచేవిసరుచు, పాదములొత్తుచు వివిధోపచారములు చేయును.)

మక—(స్వ) సత్యభామ యింతకుమునుపు మామిత్రునకుఁ జేసెడి మర్యాదలనుబట్టి యీమెకు భర్తృసేవచేసెడివిధానమే తెలియదనుకొంటిని. ఇప్పటికి నాకాసంశయముతొలఁగినది. స్త్రీజనమునకెన్నియొత్తులైననుగలవు. (ప్ర) మిత్రమా! నీచిత్తము చెడిపోయెడి సమయమిదే జాగ్రత్త.

కృష్ణ—(చిఱునవ్వునవ్వును)

సత్య—(స్వ) ఈమకరందుఁడు తినుటకుఁగొన్ని ఫలములిచ్చివీనినీ దృష్టినుండి తప్పింపవలయు (ప్ర) కమలా! నాప్రాణనాథునకు నేనీ ఫలములు సమర్పించెదను. నీవామకరందునకుఁ జందనమిచ్చిఫలములు సమర్పింపుము.

మక—మిత్రమా! ఇంతకుముందు సత్యభామయననేమోయనుకొంటిని. ఆమెయోగ్యత యిప్పుడు తెలిసినది. కమలా! ఆలస్యము చేసెదవేమి ?

కమ—బ్రాహ్మణా! వచ్చుచున్నాను.

మక—ఓసీ! నేనుస్వస్తివాచనిక బ్రాహ్మణుఁడననుకొంటివా

యేమి? బ్రాహ్మణాయని పిలుచుచున్నావు.

కమ— అయ్యా! నిన్ను శూద్రుడాయని పిలుతునా ?

మక— కమలా! నీవనుగ్రహపూర్వకముగాఁ బిలిచినచో నెట్లు పిలిచిననుతప్పులేదు. ఆగ్రహముతోఁ బిలిచితివేమో యనియట్లంటిని.

కమ— నాయాగ్రహానుగ్రహములతో నీకేమి కావలసియున్నది.

మక— అట్లనకుము. కావలసిన కార్యములన్నియు నీయనుగ్రహములో నేయున్నవి. ఆ తీసుకొనివచ్చినవి కొంచమధికముగాఁ దీసికొనిరా.

కమ— (పుష్పచందనము లాతనికిచ్చి ఫలములు ముందుఁ బెట్టును.)

మక— (వికారదృష్టులతోఁ గమలా కృష్ణ సత్యభామలను జూచుచుఁ దినుచుండును.)

సత్య— ప్రాణేశ్వరా! ఇంతకుమున్ను నాకుఁగలిగిన కోరికల నీడేర్చినన్ను నీప్రియవల్లభనుగా స్వీకరించితివను గర్వమున నేటివఱకునునొడలెఱుంగకుంటిని.

కృష్ణ— ఇప్పుడు మాత్రము నీకువచ్చినలోపమేమి ?

సత్య— నాకు నేఁడొకకోరికకలిగినది. దానికి నీసహాయము కావలసియున్నది. ప్రతిపదమును నామనోరథములకై నిన్ను శ్రమపెట్టుట భావ్యముకాకపోవుటచేతను ప్రస్తుతము నాకుఁగలిగిన కోరిక వర్జనీయముగాకపోవుటచేతను నాహృదయము సముద్రమధ్యమున నుభయపార్శ్వములయందుఁ దరంగములచే నెగురఁగొట్టఁబడు నొకచందమున డోలాయమానమగుచున్నది.

కృష్ణ— మనోహారిణీ! నీహృదయమంత డోలాయమానముగా నేల? నేనెప్పుడైనను నీయిష్టమున కన్యథానడచితినా?

సత్య—ఇదియింతకుఁబూర్వము నీవు నెఱవేర్చిన మనోరథముల వంటిదిగాదు.

కృష్ణ—ఎంతదైననేమి ? చేయఁదలంచినదియొక భారమా ? చెప్పుము.

సత్య—నాథా! నేనొకవ్రతము చేయనుంటిని.

కృష్ణ—దానికేమి దానధర్మములును వ్రతములును పుణ్యాంగనలు చేసికొనవలసినవేకదా?

సత్య—అది సామాన్యవ్రతముగాదు.

కృష్ణ—దానిపేరేమి?

సత్య—అది అకర్షణవ్రతము.

కృష్ణ—దీనికిఫలితమేమి?

సత్య—భార్యాభర్తలనోన్యోన్య మెడబాయకుండుట.

కృష్ణ—ఈవ్రతము నివేలచేయవలసివచ్చినది ? నాతో నీకెప్పుడైన నెడబాటుగలిగియున్నదా?

సత్య—నేనామాట చెప్పితినా? పూర్వము వ్రతములు చేసిన మహాత్ములందఱును దమకు గొఱఁతపడినప్పుడే చేసిరా? వ్రతానుష్ఠానము లుత్తమకార్యములు గావునఁ బుణ్యవంతు లవి యాచరించుచుందురు,

కృష్ణ—మంచిది. దీనిలో నావలన నీకుఁ గావలసిన సహాయమేమి ?

సత్య—ముందుఁ గావలసినదే నీసహాయము.

కృష్ణ—అట్లయిన నాసహాయమునకుఁ గొఱఁతయేమియు నుండదు చెప్పుము.

సత్య—నాథా ! ఈవ్రతములో నిన్ను నేనొకతపస్వికి దాన

ము చేయవలసియున్నది. దానికి నీవొడంబడవలయు నిదియేనామనో రథము.

కృష్ణ—నన్ను దానమిచ్చెదవా?

సత్య—ఔను. భర్తను దానమీయవలయునని వ్రతనియమ ములోనున్నది.

కృష్ణ—మకరందా! వినుచుంటివా ?

మక—ఆ !! తినుచుంటిని. ఇప్పుడు మాటలాడుటకు వీలు లేదు. ఇవియన్నియు సమాప్తమగువఱకు, నన్ను మాటలాడిం పకుము.

కృష్ణ—ప్రాణేశ్వరీ! నన్నొకరికిదానమిచ్చినచో భార్యాభర్త లన్యోన్యము నెడఁబాయకుండు టెట్లుతటస్థించును?

సత్య—నాథా! భర్తను ముందుదానముగానిచ్చి పిదప వాని యెత్తు ధనధాన్యభూషణాదిపదార్థములుతూఁచి ప్రతిగ్రహీత కర్పించి మరల భర్తను స్వీకరింపవలయు. ఇదియే వ్రతనియమము. అందువలన నే దీని కాకర్షణవ్రతమని పేరువచ్చినది.

కృష్ణ—(నవ్వుచు) నన్ను తూఁపఁగలిగినపదార్థము నీయొద్దను న్నదా?

సత్య—(నవ్వుచు) నాథా! అష్టదిగ్గజములనుగూడ తూఁపఁగలి గినన్ని భూషణములు నాయొద్దనుండ నీవిస్వల్పమునకెట్లు ప్రశ్నించితి వేమి?

కృష్ణ—నీయొద్ద నన్ని భూషణములున్న సంగతి నాకుఁ దెలియక ట్లుంటిని, కాని నీకీవ్రతము చేయుమని యుపదేశించివారెవరు?

సత్య—సర్వజ్ఞుఁడగు నారదమహర్షి.

కృష్ణ—ఆమహానీయుఁడు సెప్పినచో తప్పక చేయఁదగి నదియే కానిమ్ము.

సత్య—ఆవ్రతము పూర్తియగునంతవఱకు నీవెచ్చట నడుగు పెట్టక నాయొద్ద నేయుండవలయు.

కృష్ణ—నన్నునీవు దానమీయవలసియున్నప్పుడు నేను నీయొద్దనుండక మఱి యెక్కడికేగుదును.

సత్య—కమలా! కమలా! రా! రా!

కమ—అమ్మా! యేమిజరిగినది?

సత్య—నానాథుఁడువ్రతమున కొప్పికొనినాఁడు.

కమ—కృతార్థులమైతిమి.

మక—నాతిండిగోలమీఁద నేనున్నాను. పాపము.మీమిత్రునిస్థితి యెట్లున్నదియో నాకుఁ తెలియదుగదా? కృష్ణా! నీస్థితిగతు లెట్లున్నవియో నాకొక్కటియును తెలియలేదు.

కృష్ణ—మకరందా! పూర్తియైనదా?

మక—(త్రేఁపుచు) అబ్బబ్బా! నలుగురు లేవఁదీయవలసిన స్థితిలోనికివచ్చినది.

కృష్ణ—(మకరందుని చేయిపట్టుకొని) తిన్నగా లేచిరమ్ము.అన్ని సంగతులుసెప్పెదను.

(అందఱు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము.





# శ్రీకృష్ణతులాభారము.

## తృతీయాంకము.

### విష్కంభము.

(కమలామకరందులు ప్రవేశింతురు)

మక — కమలా! యెక్కడికెక్కడికి? అంతతొందరేమి?

కమ — మకరందా! నేను శీఘ్రముగాఁబోవలయు. క్షణమైనను నిలుచుటకువీలు లేదు. విశేషములేమైననున్నచోఁ ద్వరగాఁ జెప్పుము.

మక — నావిశేషములు తరువాత చెప్పెదను. నీవింతతొందరగా నెక్కడికిఁబోవుచున్నావు. నీవిశేషము ముందుఁజెప్పుము.

కమ — మకరందా! నేఁడుజరిగెడి గొప్పవిశేషము నీమిత్రుఁడు నీకుఁజెప్పలేదా?

మక — నాకేమియును దెలియదే!

కమ — ఓహో!! నీనోటిలో మాటదాఁగదని చెప్పకపోయి యుండవచ్చును. లేనిచో కృష్ణుఁడునీకుఁ జెప్పకుండెడివాఁడా?

మక — కమలా! యేమది వింతగామాట్లాడుచున్నావు. నిన్న నీవుపెట్టిన ఫలాహారాలన్ని యింతవఱకుఁగూడ నిముడ్చుకొని అబ్బా! అబ్బా! కడుపులో కుట్టెత్తినపుడెల్ల "కుట్లకల్లా" యెందుకుతింటిరా భగవంతుఁడా!యని లోలోపలవిసుకుకొనిచచ్చుచుఁగూడఁ బైకివెల్లడింపని నేనంతమాత్రమొకమాట యిముడుచుకొనలేనా? అబ్బా!! యీ మాటలకేమి? ఆవిశేషమేమిటో చెప్పుము.

కమ — మా సత్యభామ వ్రతమొకటి తలపెట్టినది. అది తన

గోడకోదండశ్రీకుఁ దెలియకుండ నొకవేర్పుఁగొనుట కీదినముననే నుము హూర్తము నిర్ణయించినది.

మక—తనగోడకోదండశ్రీకుఁ దెలిసిన నేమి?

కమ—తెలిసినచో వ్రతభంగము కాఁగలదు.

మక—అదియా సందర్భము వ్రతభంగమైన నేమి?

కమ—పిచ్చిబ్రాహ్మణుఁడా! వ్రతముచేసికొనుట వ్రతభంగ మునకా?

మక—పొరపాటు పొరపాటు. వ్రతభంగమునకుఁ గారణ మేమి?

కమ—ఈవ్రతములో సత్యభామ తనభర్త నొకరికి దానమీ యవలెను. ఆసంగతి గోడకోదండశ్రీకుఁ దెలిసినచో నారూరకొందురా?

మక—అయ్యో! అయ్యో! మిత్రుఁడా! మిత్రుఁడా! కృష్ణా! కృష్ణా! (కేకలు వేయును)

కమ—నీకేమైనఁ బిచ్చిపట్టినదా యేమి? యెందుకా కేకలు?

మక—కమలనయ్నా! నాకుభయమగుచున్నది. రక్షింపుము. రక్షింపుము. (పాదములపైఁబడును)

కమ—అయ్యో! పిచ్చివాఁడా! ఇదియేమిగ్రహాచారము. అఁ డుదానికాళ్లపైఁబడెద వేమి?ఏమిపురుషుఁడవయ్యా? లే లే? నీకుభయ మెం దుకు?

మక—ఎందుకా? నన్నుఁగూడ నీవెవ్వరికైన దానమిచ్చుటకు రాలేదుగదా?

కమ—అయ్యో! ఛాందసుఁడా! నిన్ను నేనేటికి దానమిచ్చెదను.

మక—ఆమె యాయన నేటికిదానమిచ్చుచున్నది?

కమ—ఆయనను వశ్యునిఁ జేసికొనుటకు.

మక—నీవుగూడ నన్నందుకే

కమ—పిచ్చిముండకొడుకా! అవునవును,నీబోఁటిబుద్ధిమంతుఁడు రూపవంతుఁడు ధైర్యవంతుఁడు మాకెక్కడ దొరకును?

మక—కమలా! నీమాట నిజమేనా యేమి?

కమ—నిజమే (జుట్టుబట్టుకొని రెండుగుద్దులు గుద్దును)

మక—కమలమ్మగారూ! నన్ను విడువు తల్లీ! నీపేరుతో దేవతకు బెట్టుకొందునమ్మా!నన్నువిడిచిపెట్టు నన్నువిడిచిపెట్టు. (ఏడ్చును)

కమ—మకరందా! యేడువకుము విడిచిపెట్టితినిలే. నీవాఁడు దానిచేతిలోనికిఁగూడఁ జాలనివాఁడవను కొనలేదుసుమా?

మక—ఇప్పుడు తెలిసినదా?

కమ—తెలిసినదిలే చాలు. నేనింక నీతోఁ బొద్దుపుచ్చుటకు వీలులేదు. బ్రాహ్మణులును పేరంటాండ్రును అందఱును ఇప్పటికే వచ్చియుండవచ్చును. వ్రతము ప్రారంభింపఁబడి యుండవచ్చును. పేరటాండ్రకుఁ బసుపు కుంకుమలిచ్చుటకు నేను సిద్ధముగానుండవలయు. నేనుబోవుచున్నాను.

మక—కమలా! నన్నుమాత్రము మఱచిపోవలదుసుమా? నేనుగూడ వచ్చుచున్నాను. నేనెక్కడఁకూర్చున్ననునరేఁకను పెట్టియుండుము. నీదేకదా అక్కడిపెత్తనము. వడ్డించువాఁడు మనవాఁడైనచో కడబంతిలోఁగూర్చున్నను లోటేమున్నది?

కమ—నీవన లందుకొఱకవతరించిన మహాపురుషుఁడవేకదా? రా రా నీకేమిలోపము.

(నిష్క్రమించును)

మక—అబ్బబ్బా! భర్తను వశునిఁజేసికొనుటకు వ్రతములఁట, దానములఁట, యేమిచిత్రము? పతిభక్తి యేటిలోఁగలిసిపోయినది.

ఎట్లైనను ఇప్పటియాఁడువాండ్రకు భర్త కుక్కవలె భృత్యానుభృత్యుఁడై కూర్చుండుమన్నచోటఁ గూర్చుండునట్లును, నిలుచుండుమన్నచోటనిలుచుండునట్లును, ఉండవలెను దానికై వారెన్ని పాట్లైనను బడు మందురు. భగవంతుఁడు నాకీయగచాట్లుతప్పించినాఁడు. బ్రతికిపోయినాను. నాకే కనుక యొక్క భార్యాపిశాచమున్నచో నేనెన్ని పాట్లు పడవలసి యుండునో! ఇప్పుడు మాకృష్ణప్పను జూచుచుండలేదా? ఇంతకును ఆయనసమర్థుఁడుగనుక దాఁటుకొని వచ్చుచున్నాఁడు. నాబోఁటివాఁడైనచో నెప్పుడో యెందులోనైన నొక్కతూములో ముక్కు మూసికొనెడివాఁడే! నాకీసంగతు లెందుకు? త్రేపు త్రేపు (త్రేపి) వ్రతము మిగిలిపోవునేమో త్వరగాఁబోవలెను.

(నిష్క్రమించును)

---

## —♦ వ్రతమందిరము. ♦—

(కృష్ణుఁడు సత్యభామయుఁ బీఠములపైఁగూర్చుందురు. గర్గమహర్షి నారదమహర్షి సభ్యులందఱు యథాస్థానములఁ గూరుచుందురు)

గర్గ—అనయోర్దంపత్యోః అరుంధతీ వసిష్ఠయోరివ, ఛాయా సూర్యయోరివ, సీతారామయోరివ, లక్ష్మీనారాయణయోరివ, నిరంతరానపాయితాసిద్ధ్యర్థం శ్రీసంకర్షణదేవతాముద్దిశ్య శ్రీసంకర్షణ దేవతాప్రసాద సిద్ధ్యర్థంచ సంకర్షణపూజాంకరిష్యే.

సత్య—(పై వాక్యములు చెప్పి కలశోదకమును ముట్టుకొనుచున్నది.)

గర్గ—అస్యశ్రీ ఆకర్షణ వ్రతస్య సంకర్షణో దేవతా.

శ్లో॥ సంకర్షణం మహాదేవం భర్తృవశ్యత్వసాధనం
ధ్యాయామి భక్తిభావేన స్త్రీణాం కల్పమహీరుహం॥

సత్య- శ్రీసంకర్షణదేవం ధ్యాయామి.

గర్గ-శ్లో॥ సంకర్షణ మహాదేవ త్వామావాహ్య దివౌకసః
విజయం ప్రాప్నువన్ స్వామిన్ తస్మాదావాహయామ్యహమ్॥

సత్య—శ్రీసంకర్షణదేవమావాహయామి.

గర్గ-శ్లో॥ వజ్రవైడూర్యమాణిక్యఖచితం స్వర్ణనిర్మితం
సంకర్షణమహాదేవ సింహాసనమిదం ప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ సింహాసనం సమర్పయామి॥

గర్గ-శ్లో॥ సుగంధిభిరమీభిస్తే జలైరర్ఘ్యం ప్రకల్పితం।
సంకర్షణ మహాదేవ తదిదం ప్రతిగృహ్యతాం॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ అర్ఘ్యంసమర్పయామి॥

గర్గ-శ్లో॥ ఇదం పాద్యం పవిత్రం తే సమానీతం నిరీక్ష్యతాం
అనేన క్షాళయామ్యద్య స్వామిన్ పాదాంబుజద్వయం॥

సత్య—శ్రీసంకర్షణ దేవాయ పాద్యం సమర్పయామి॥

అర్ఘ్య-శ్లో॥ మధురం లఘు పానీయం పరిశుభ్రం మనోహరం
సంకర్షణమహాదేవ గృహ్యా మాచమనీయకం॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ ఆచమనీయం సమర్పయామి॥

అర్ఘ్య-శ్లో॥ క్షీరాజ్యమధుభిర్యుక్త మిక్షుఖండరసైర్యుతం॥
పంచామృతమిదంతుభ్యం సంకర్షణ సమర్పితం॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ పంచామృత స్నానం సమర్పయామి॥

అర్ఘ్య-శ్లో॥ శుద్ధైః ప్రసాదసంపన్నైర్నర్మ దానదిసముద్భవైః
సంకర్షణ త్వాం సలిలైస్స్నాపయామి మహాప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ శుద్ధోదకస్నానం సమర్పయామి॥

అర్ఘ్య-శ్లో॥ కౌశేయతంతుసంవీతం పీతవర్ణం మనోహరం॥
సంకర్షణ మహాదేవ వస్త్రయుగ్మమిదంప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ వస్త్రయుగ్మం సమర్పయామి॥

అర్ఘ్య-శ్లో॥ ముక్తామణిమయైశ్చిత్రైస్స్వర్ణవర్ణైస్సముజ్జ్వలైః
పవిత్రైస్తంతుభిర్దృప్త ముపవీతం దదామి తే॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ యజ్ఞోపవీతం సమర్పయామి॥

అర్ఘ్య-శ్లో॥ మృగనాభిసమాయుక్తః కర్పూరాగురువాసితః
త్వదంగేషుసుఖాయాస్తాం గంధస్సంకర్షణప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ గంధం సమర్పయామి॥

అర్ఘ్య-శ్లో॥ హరిద్రాసహితానేతాన్ స్వర్ణఖండానివోజ్జ్వలాన్
అర్పయామి తవ ప్రీత్యై శ్రీమాన్ సంకర్షణప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ అక్షతాన్ సమర్పయామి॥

గర్గ-శ్లో॥ అమీభిర్వివిధాకారై స్సుమనోభిర్మనోహరైః
సారభ్యపరిపూర్ణైస్త్వా మర్చయామి జగత్ప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయపుష్పాణి సమర్పయామి॥

(గర్గమహర్షి చెప్పుచుండ సత్యభామ పూజచేయును)

గర్గ—పద్మపాదస్య పాదౌ పూజయామి
సుకుమారగుల్ఫస్య గుల్ఫౌ పూజయామి
నాగహస్తోరోః ఊరూపూజయామి
కనకసూత్రకలాపాలంకృతకటేః కటింపూజయామి
విశాలవక్షసః వక్షః పూజయామి
దీర్ఘబాహోః బాహూ పూజయామి
శంఖచక్రాంకితకరస్య హస్తౌ పూజయామి
స్మితముఖస్య ముఖంపూజయామి
త్రివళీవిభ్రాజితకంఠస్య కంఠం పూజయామి
పుండరీకాక్షస్య నేత్రేపూజయామి
శ్రీకర్ణస్య కర్ణౌపూజయామి
సుందరభ్రువోభ్రువౌపూజయామి
సుశిరసః శిరఃపూజయామి
సంకర్షణమహాదేవస్య సర్వాణ్యంగాని పూజయామి॥

శ్లో॥ నానాసుగంధద్రవ్యాణాం వ్యామిశ్రణముపేయుషా
ధూపేనాధూపయామి త్వాం సంకర్షణమహాప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ ధూపం సమర్పయామి

గర్గ-శ్లో॥ త్రైలోక్యతిమిరఘ్నేన ఘృతవర్తి విరాజితా
దీపేన దీపయామి త్వాం సంకర్షణమహాప్రభో॥

సత్య—శ్రీసంకర్షణమహాదేవాయ దీపంసమర్పయామి

గర్గ-శ్లో॥ సర్పిఃక్షీరగుడైర్యుక్తం పంచభక్ష్యైరిదంయుతం
నివేదయామ్యహంతుభ్యం సంకర్షణమహాప్రభో॥

సత్య—శ్రీసంకర్షణమహాదేవాయ నివేదనం సమర్పయామి॥

గర్గ-శ్లో॥ ఏలాలవంగ కర్పూరజాతిపూగఫలైర్యుతం
తాంబూలంగృహ్యతాం దేవ సంకర్షణమహాప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ తామ్బూలం సమర్పయామి॥

గర్గ-శ్లో॥ ద్వాదశాదిత్యసంకాశం ప్రభయాసంప్రభూతయా
కర్పూరనీరాజనం తే సంకర్షణ దిశామ్యహం॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ నీరాజనం సమర్పయామి

గర్గ-శ్లో॥ సాధనం సర్వకార్యాణాం త్వత్ప్రసాదస్యభాజనం
మంత్రపుష్పమిదం దేవ సంకర్షణమహాప్రభో॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ మంత్రపుష్పం సమర్పయామి॥

గర్గ-శ్లో॥ అపరాధసహస్రఘ్నాన్ శ్రద్ధాభక్తిసమంచితాన్
ప్రదక్షిణ నమస్కారాన్ సంకర్షణ గృహాణ మే॥

సత్య—శ్రీసంకర్షణదేవాయ నమస్కారాన్ సమర్పయామి॥

గర్గ-శ్లో॥ యం త్రైక్రియాయాం శ్రద్ధాయాం సర్వేషు విషయేషు వా
యో మే భవతి లోపస్తం క్షమ సంకర్షణప్రభో॥
అనేనచిదంబరేశ్వరకల్పోక్తప్రకారేణకృతయాపూజయా
శ్రీసంకర్షణదేవస్సుప్రీతస్సుప్రసన్నో వరదోభవతు.

సత్య—శ్రీసంకర్షణార్పణమస్తు. (అక్షతోదకము విడుచును.)

గర్గ—అమ్మా సత్యభామా! ఇఁక భర్తృదానమే యవశిష్టము గ నున్నది.

సత్య—అయ్యా! ప్రతిగ్రహీత లెవరు?

గర్గ—అయ్యా! సభ్యులారా! మీరందఱుఁగూడి యీదానమున కెవరర్హులో నిర్ణయింపుఁడు.

సభ్య—అయ్యా! యీమహాకార్యమునకు సాక్షాద్బ్రహ్మపుత్రుఁడగు నారదమహర్షి కన్న నీసభలోనధికు లెవ్వరును లేరు.

గర్గ—అయ్యా! నారదమహర్షీ! తమరీపీఠము పైకిదయ చేయుఁడు.

నార—గర్గమహర్షీ! మీరందఱును నాతండ్రియందుండు నభిమానముచే నన్ను పెద్దగాఁ జేయుచున్నారు. కాని నాకంత యోగ్యతయున్నదని నేను చెప్పఁజాలను.

గర్గ—మహానుభావా! మహాత్ములు తమయోగ్యత్వముం బ్రకటించుకొనుటకు లజ్జించుచుందురు. మీరు ప్రతిబంధముఁ జెప్పవలదు. దయచేయుఁడు.

నార—(సంశయించుచున్నాఁడు.)

సత్య—స్వామీ నారదమహర్షీ! సంశయించెద వేమి? దయచేసి నామనోరథపూర్తిఁ గావింపుము.

నార—(నవ్వుచువచ్చి పీఠముపైఁ గూర్చుండును)

సత్య—(కృష్ణుని ముందుంచుకొని నారదుని చేతిలో ధారఁ బోయుచున్నది)

నార—(ప్రతిగ్రహించి) కృష్ణా! నిన్నుఁ బ్రతిగ్రహింపఁగల భాగ్యము సేకూరుటచే నేనిప్పటికి ధన్యుఁడ నైతి. నాతపస్సు నేఁటికి సిద్ధించినది. మనమిఁక నేగుదము రమ్ము.

కృష్ణ—(సత్యభామవంకఁజూచుచున్నాఁడు.)

నార—కృష్ణా! నీవు సత్యభామవంకఁజూడఁగూడదు. నావాఁడవై తివి. కావున నావంకఁజూడుము.

కృష్ణ—(నారదునివంకనే చూచును)

సత్య—మునీంద్రా! యేమియిట్లనెదవు? నానాథునిఁ దీసికొనిపోఁదలఁచితివా యేమి?

నార—ప్రతిగ్రహించిన పిదపఁదీసికొనిపోక యూరకుందునా?

సత్య—నారదా! నీవుచెప్పినమాటనీకు స్మృతిలోనున్నదా?

నార—ఉండకేమి? సమర్థురాలవైనచో కృష్ణునివిడిపించుకొనిపొమ్ము.

సత్య—కమలా! తులఁదెప్పింపుము. నానాథుని యెత్తుధనము నీకిచ్చి నానాథుని స్వీకరించెదను?

నార—అదిచక్కనిమాట. కానిమ్ము.

కమల—(తులఁదెప్పించి యుంచును.)

సత్య—నాథా! ఈ తులాఫలకముపైఁ గూర్చుండుము (చేయిఁబట్టుకొనఁబోవును)

నార—సత్యభామా! చాలుచాలు. నావస్తువును నీవుముట్టుటకు నీకధికారమేమున్నది. ఆవలనుండుము. కృష్ణుని నేను కూర్చుండఁబెట్టలేనా? (కృష్ణుని తులాఫలకముపైఁగూర్చుండఁబెట్టుచున్నాఁడు.)

సత్య—(కోపముతో) కమలా! ధనముందీసికొనివచ్చి తులాఫలకముపైనుంపుము?

కమ—(నిష్క్రమించి ధనముందెచ్చి తులలోనుంచును.)

సత్య—ఏమీ? ఇంతధనమువేసినను త్రాసు వంగకున్నదే

కమలా! నాయేడువారముల సొమ్ముఁదెప్పింపుము.

కమ—(పోయివచ్చి తులలో నుంచును. తులవంగదు.)

సత్య—ఇది యేమియాశ్చర్యము? కమలా! నాచీరలన్నియును దీసికొనిరమ్ము.

కమ—(పోయివచ్చి తులలోచీరలుంచును. తులవంగదు)

సత్య—అయ్యా నారదమహర్షీ! ఇదియేమి? నానాథుఁడింత బరువుండెనా?

నార—నాకేమి తెలియును. నన్నేటికి డిగెదవు?

సత్య—(తనదేహము పైనుండుభూషణములన్నియుఁదులలోనుంచును. తులవంగదు) అయ్యో? నాగతి యేమిదైవమా! నేనెందుకీవ్రతమును బూనుకొంటిని. నాకీవ్రతమువలన నెంతపరాభవము చేకూరినది (దుఃఖించును)

నార—అయ్యాకృష్ణా! లెమ్ము మనమేగుదము. (కృష్ణునిలేవఁదీయుచున్నాఁడు)

సత్య—అయ్యా నారదమహర్షీ! నీకు నమస్కారముఁజేయుచున్నాను. నానాథునెక్కడికిఁ దీసికొనిపోయెదవు.

నార—అమ్మా! నాకుఁదోఁచినచోటికిఁ దీసికొనిపోయెదను.

సత్య—అయ్యా! యెవరికిచ్చెదవు?

నార—ఈతనియెత్తు ద్రవ్యమిచ్చుడివారి కీతని నిచ్చెదను.

సత్య—అయ్యా! నన్ను మొట్టమొదట భర్తృవశీకరణమునకు వ్రతము సేయుమని చెప్పి తుదకిట్లు సేయుట నీకున్యాయమా?

నార—అమ్మా! యొందఱికో ప్రియుఁడైన శ్రీకృష్ణుని నీవొక్కదానవే ముంగిటిలోఁ గట్టివేసికొనఁదలఁచుట నీకున్యాయమా?

సత్య—ఈసంగతి మొట్టమొదటనే చెప్పకపోతివా?

నార—చెప్పక పోయినదేమున్నది. చెప్పినదానికి వ్యతిరేకముఁ జేసినదేమున్నది?

సత్య—అయ్యో! నానాథుని నేనెట్లెడఁబాసియుండఁగలను?

నార—నావస్తువును నేనెట్లెడఁబాసియుండఁగలను?

సత్య—అయ్యో! నీకిది ధర్మమా?

నార—అమ్మా! నీకిది ధర్మమా?

సత్య—నీవింతవంచకుఁడవను సంగతి నాకుఁదెలియక మోసపోతి ని సుమా?

నార—నీవింత యసమర్థురాలవను సంగతి నాకుదెలియక దాన ముపట్టితినినుమా?

సత్య—నాథా! నన్నొకసారి చూడవేమి?

నార—ఒకరికి స్వాధీనమైనవస్తువు నందు నీకు స్వాతంత్ర్య మేమున్నది? నీవట్లెన్నఁటికినిఁ బిలువకుము.

సత్య—అయ్యో! నాగతియింతియేనా?

నార—యుక్తాయుక్తము లెఱుంగక దానమొసఁగెడివారి గతు లన్నియు నింతియేసుమా? కృష్ణా! మనమిచ్చట నిఁకనుండఁగూడదు. ఈ తంబురా బట్టుకొని రమ్ము. వెళ్లుదము.

కృష్ణ—తంబురాబట్టుకొని వెంటనడుచుచున్నాఁడు)

నార—(తాళమువాయించుచు నాట్యముచేయుచు)

—గేయము—

దర్విణచింత నీ కామిని యఁటరా?
దండించెడివాఁడిఁక లేఁడఁటరా?
భువనములో సత్సంగంబాక టే
భవసింధువుదాఁటఁగ నావికరా! భజ॥

(అందఱు నిష్క్రమించుచున్నారు)





# శ్రీకృష్ణతులాభారము

## చతుర్థాంకము.

(సత్యభామ కమలతో ప్రవేశించును)

సత్య—కమలా ! నేనెంత బుద్ధిహీననైతినే. నేనెంత పాతకి నైతినే. నా ప్రాణేశ్వరుని, నామనఃకాంతుని, నాపంకజాక్షుని నా నారదుఁ డెంత చిక్కులు బెట్టుచున్నాఁడో, నానిమిత్తమై కరుణాసముద్రుఁడగు నానాథుం డెన్నికష్టములం బడుచున్నాఁడో గదా !

మ॥ జననిందాశతభాజనంబనయి నైచ్యంబొందు నాకన్న నే
వనితామండలిలోన నే పడఁతి యే వామాంగి కుప్రవ
ర్తనయై జ్ఞానవిహీనయై బహుమదాంధస్వాంతయై ప్రాణనా
థుని భవ్యాత్ముని దానమిచ్చు నకటా? దుర్బుద్ధినైతిం గదే॥

కమలా ! నాకింక ధైర్యమిచ్చువారెవరే ? నాకేమార్గము దోఁపకున్నయది. ఆనారదుఁడింతలో నానాథు నెవనికి విక్రయించునో యని నాహృదయము భయకంపితమగుచున్నది. కమలా ! ఈయాపత్కాలములో నీవు నాకేదైన నొకయుపాయముఁ జెప్పి గట్టెక్కింపవలయు. సఖీ నీవేనాకుగతి.

కమ—అమ్మా! నాకిప్పుడొక యుపాయము తోఁచుచున్నది. నీవభిమానవతివి. కావున నీకాయుపాయముఁ జెప్పుటకు నేను సంశయించుచున్నాను.

సత్య—సఖీ ! నీవు సంశయింపక చెప్పుము.

కమ—అమ్మా ! నీసవతుల్ల కడకేగి వారి వస్త్రభూషణాదులం దీసికొనివత్తుమా ?

సత్య—సఖీ ! ఇప్పటికే నాయభిమానమంతయు నిర్దగ్ధమైనది. పరివారగు నాతోడికోడండ్రకాళ్లు పట్టికొనవలసిన దుర్విపాకముకూడ సంప్రాప్తించినదా ?

కమ—అమ్మా ! కాల మొక్కవిధముగ నెట్టివారికిని గడవదు. కార్యసమయమునసియభిమానమును బెట్టుకొన్న కార్యముగట్టెక్కునా?

సత్య—సఖీ ! అభిమానము చంపుకొనినను శ్రీకృష్ణుని దానమిచ్చితినని వారియెదుట నేనే మొగముం బెట్టుకొని చెప్పఁగలనే?

కమ—నీవంతగా చెప్పలేకపోయిన నేను చెప్పెదనులే. రావమ్మా, కార్యమతిక్రమించుచున్నది. (ఇద్దఱును పరిక్రమింతురు)

—॥ జాంబవతీగృహము ॥—

(జాంబవతీ లక్ష్మణాలు ప్రవేశింతురు)

కమ—అమ్మా ! మీతోడికోడండ్రు జాంబవతీ లక్ష్మణలిద్దఱునిదిగో నచ్చట ముచ్చటించుకొనుచున్నారు. త్వరగారమ్మా.

(ఇద్దఱును వారిని సమీపింతురు)

జాంబ—ఓహో ? సత్యభామయా? సత్యభామా ! నీవెన్నఁడును మాయింటిదెసఁగని దానవే. ఇప్పుడిచ్చటికి నీవు వచ్చుటఁ జూడ మాకత్యద్భుతముగా నున్నది. రారా.

కమ—అమ్మా ! జాంబవతీ ! సత్యభామ నేఁడు మీవలననొక కార్యము నాశించివచ్చినది. మీకడకింతకు ముందెప్పుడు నీమె రాకపోయినను నిమెకు మీయెడఁ బ్రేమభావము లేకపోలేదు.

లక్ష్మ—ఓసీ ! సత్యభామ యేలయడుగరాదు?

సత్య—అమ్మా లక్ష్మణా! మీకడ నే నా కార్యము చెప్పుటకు లజ్జపడుచున్నాను.

జాంబ—అట్లైన కమలా ! నీవే చెప్పుము.

కమ—అమ్మా ! సత్యభామయొక వ్రతము సేసి కృష్ణుని నారదమహర్షికి దానమిచ్చినది. అతఁడు కృష్ణుని యెత్తు ద్రవ్యము తూఁచి యిచ్చినచో కృష్ణుని విడిచెదనని చెప్పినాఁడు. కృష్ణునివిడిపించుకొనుటకై మా సత్యభామ తనయొద్దనున్న వస్త్రభూషణాదిద్రవ్యమునంతయుఁ దులయందుంచి తానేకవస్త్రయై నిలువఁబడినది. కాని కృష్ణునితో నీమె ద్రవ్యమంతయుఁ దులఁదూఁగలేదు. కావున మీసహాయమును బ్రార్థించుటకై వచ్చినది.

జాంబ—ఓసీ నిర్భాగ్యురాలా! శ్రీకృష్ణుఁడు నీకొక్క దానికే భర్తయనుకొంటివా ?

లక్ష్మ—ఓసీ గోముఖవ్యాఘ్రమా ! భర్తయందు మహాప్రేమయున్నట్లు నటించుచుంటివిగదే. ఇప్పు డాతని నీవెట్లు మఱియొకనికి దానమిచ్చితివే?

సత్య—(జాంబవతీ లక్ష్మణల కాళ్లుపట్టుకొని) అక్కలారా ! నాయపరాధమును క్షమించి నాకీయాపత్కాలమున సహాయము సేయుఁడు. లేకున్న మనప్రాణేశ్వరుఁడు మనకు దక్కఁడు.

జాంబ—లక్ష్మణా ! ప్రస్తుతము మనము పేక్షించినచో నీవ్యసనము మనకందఱకును సమానముగా సంక్రమించును.

లక్ష్మ—సత్యా ! మాద్రవ్యమంతయుఁ బంపుచున్నాము. నీవు ముందేగి నాథుని విడిపింపుము.

సత్య—ఇదిగో పోవుచున్నాను—(యవనిక పడును)

(నారదకృష్ణులు ప్రవేశింతురు)

నార—(కృష్ణునిచేయిపట్టుకొని) ఓపురమహాజనులారా !

ఉ॥ ఈతఁడు ధర్మమార్గముల కెల్ల నిధానము లోకరక్షణ
ఖ్యాతికి భాజనంబు పరమార్థములోఁ బరమార్థ మార్యసం
ఘాతము లీతనిన్ గనులఁగాంచుటకై తపియించుచుందు రీ
వ్రాతవవేళలందొక వదాగ్రమునన్ నిలుచుండి దీక్షచేన్।

ఈదేవకీనందనుఁడు ఈమహాపురుషుండు మీ కెవరికైనఁగావలసినచోఁ గొనవచ్చును. ఈతని కౌస్తుభనము నాకెవ్వరిచ్చెదరో వారి కీతని విక్రయించెదను. (అని కేకలు వేయుచున్నాఁడు)

సత్య—కమలా ! నారదుఁ డెక్కడ నున్నాఁడో త్వరగాచూడుము. (ఇరువురు పరిక్రమింతురు)

కమ—సఖి ! ఇదిగో ఈపురవీథిమ వీథిలో జనులుగుంపులు గూడియున్నారు. అచ్చట నున్నారేమో పోవుదమురమ్ము.

సత్య—కమలా! పద. పద. అయ్యా! నారదమహర్షి ! నిలువుము, నిలువుము.

నార—ఏమి యింత మహాకార్యము.

సత్య—ఇదిగో యేనుఁగులమీద ద్రవ్యమువచ్చుచున్నది. తీసికొని నానాథుని విడువుము.

నార—(జనాంతికము) కృష్ణా ! కోడికోడండ్రకాళ్లపైఁబడినట్లున్నది.

కృష్ణ—(జనాంతికము) కోడికోడండ్రను మాట తనచెవి సోఁకినమాత్రముననే నిప్పులు ద్రొక్కిన కోఁతివలె నెగిరిపడుచుండెడిది. పాపము కాలమువచ్చి నప్పుడెంత వారైన నేమిచేయఁగలరు?

నార—సత్యభామా! ఆద్రవ్యమంత యీఁదులలోఁదూయింపుము.

సత్య—(తూయించి నిరాశయగుచున్నది.)

నార—కృష్ణా ! మన మింకొక వీథికేగుదమురమ్ము.

(లాగుచున్నాఁడు.)

కృష్ణ—(వెనుకకుఁ జూచి) సత్యభామా! నాగతియింతియేనా?

సత్య—కమలా! నేనందుల కీవ్రతము జేసితినే. నేనెంత మందబుద్ధినే. నానాథుని దీనాలాపములు నాహృదయమును శూలములై విదారించుచున్నవే. అయ్యో? యింక నాకేమిగతి.

కమ—అమ్మా! మిగిలిన తోడికోడండ్రదగ్గర కేగుదమురమ్ము.

సత్య—ఎంత పరాభవము గాఁదగియున్నదో యంతయుఁ గావలసినదే పదపద. (నిష్క్రమించుచున్నారు)

—చతుష్పథము—

(నారదకృష్ణులు ప్రవేశింతురు)

—గేయము—

ఎవ్వరమో? మనమెక్కడి వారమొ?
యెవ్వరు మన తలిదండ్రులొకో?
ఇవ్విధి యోజించిన సంసారం
బెల్లను స్వప్నవిచారము రా! భజ!

నార—(కృష్ణుని చేయిపట్టుకొని) ఓ మహాజనులారా!

సీ. ఈతఁడుండెడి చోటు లెల్లను నిత్యక
ళ్యాణవైభముచే నలరుచుండు
ఇతని సన్నిధినుండు నతనికిఁ బట్టిన
దెల్ల బంగారమై యొనఁగుచుండు
ఇతని స్నేహము గల్గ నెవ్వఁడేనియును బ్ర
హ్మానందమున నోలలాడుచుండు
ఈతని చేతనుద్వీక్షింపఁబడువాఁడు
భువనసంపూజ్యుఁడై పొలుచుచుండు.

గీ. ఇతఁడితండన్న మనవలె నితఁడుగాఁడు
అతని కతఁడె వెలింగెడు నతఁడితఁడు

అమ్మచున్నాఁడ నితని దానమ్ముబట్టి
కొనఁదలంచిన వారెల్ల కొనరె కొనరె॥

సత్య—కమలా ! అయ్యో నాతోడికోడండ్రు చేసిన యవమానంబునకు నేనింక జీవింపను.

కమ—అమ్మా! ఎవరికాలము మంచిదైనప్పుడు వారట్లే పరాభవించుచుందురు. నీవు మాత్రము మంచికాలములో నెంతమందికి నవమానము సేయలేదు. అంతటితో వారు ప్రాణములు విడిచిరా ? శచీదేవి నీకృతంబునఁ గదా పారిజాతమును పోగొట్టుకొని దేవతలలో మొగమెత్తలేక కృశించుచు జీవించుచున్నది. నీతోడికోడండ్రు నీచే నెన్నిమారులు పరాభవింపఁబడి యుందురు? ఇంతయేల? సత్యభామా. రుక్మిణి మాత్రము నీచే నెన్నిమారులు పరాభవింపబడలేదు. అంతటితో నామె ప్రాణములు విడచినదా ?

సత్య—కమలా ! రుక్మిణి పాదము లొత్తుటకుఁ గూడ నేను బనికిరానుసుమా ? చూచితివా నాతోడికోడండ్రిందఱును నాకెంత యవమానము సేయవలయునో యంతయవమానము చేసినను నారుక్మిణి పల్లెత్తి యొక్కమాట గూడ నన్ననక మర్యాదాపూర్వకముగ తన యొద్దనున్న ద్రవ్యమంతయు మనకొసంగి ప్రియుని విడిపించుకొనుమని పలువిధములఁ బ్రార్థించినదే. ఆమె యోగ్యత నాకు జన్మశతములకైనను బ్రాప్తించునా ?

కమ—సఖి! మరల నానారదుఁడు నీనాథునెక్కడికి లాఁగుకొనిపోవునో త్వరగాఁ బోయి వెదకుదము రమ్ము. అందఱితోడికోడండ్రు వస్త్రభూషణాది ద్రవ్యమంతయుఁ దెచ్చినారముగదా? దీని చేతనైనఁ దులఁదూఁగలేకుందుమా ! రా ! రా ! (పరువెత్తును)

సత్య—వద, వద, (పరిక్రమించి) నారదమహర్షీ. నిలువుము, నిలువుము.

నార—కృష్ణా! మిగిలిన తోడికోడండ్రు ద్రవ్యమంతయును దీసికొని సత్యభామ వచ్చుచున్నట్లున్నది.

కృష్ణ—ఇప్పటికి సంపూర్ణముగా నెంత కావలయునో యంత యైనది. ఇఁకను శాంతి గావలయునా?

నార—కృష్ణా! కరుణామయుండవగు నీకట్లు దోఁచుచున్నది. కాని ఇదియంతయు నభిమానధ్వంసము సేసి జ్ఞానము కలిగించుటకు సాధనముగాదా?

కృష్ణ—నిజము నిజము. భక్తాగ్రేసరుఁడవగు నీకు నేను స్వాధీనుఁడనే కదా, ఇంతకు నెంత చేయఁదలఁచికొంటివో యంతయుఁ గానిమ్ము.

నార—సత్యభామా! నీవు మరలఁ దెచ్చిన ద్రవ్యమంతయుఁ దులలోఁ బెట్టుము.

సత్య—చిత్తము (అంతయుఁ దులదూయుచున్నది)

రమ—అమ్మా! సత్యభామా! ఇది యేమో మాయగానున్నదమ్మా.

నార—మాయగాదు శాంతి.

సత్య—ఏమిశాంతి.

నార—గర్వశాంతి.

సత్య—మహానీయా! నీమనోరథము పరిపూర్ణముగా నెఱవేఱినది. ఇంకనైనను నన్ననుగ్రహింపుము. (పాదములపైఁబడును)

నార—పిచ్చిదానా! లెమ్ము, లెమ్ము, ఈతుచ్ఛమగు ద్రవ్యముతో బ్రహ్మాండభాండమండితోదరుండగు నీపుండరీకాక్షుని నీవు దులదూఁపఁగలవా? ఈతఁడుభక్తి చేతనొసంగిన యొకతృణమునకు లొంగినట్లు దురభిమానముచే నొసంగిన చతుర్దశభువనంబులకేనియు లొంగె

డివాఁడుగాఁడు. ఈతనిమహాత్మ్యము కొంచెము జెప్పెదను వినినమైనను తరింపుము.

సీ॥ పుణ్యపాపములలోఁ బొరలాడుచుండెడు
సర్వంబునకు నాదిసాక్షి యితఁడు
జ్ఞానఖడ్గమున నజ్ఞానసత్వంబు ను
క్కడఁగించువారికి గతి యితండు
మాయాంధకార నిర్మగ్నాత్ములగువారి
కల్పుండుగాఁదోఁచు నధికుఁడితఁడు
తనయందుఁ జిత్తముంచినవారి సాన్నిధ్య
మెడబాయకుండు సర్వేశుఁడితఁడు

గీ॥ ఇతఁడజుండు వికారవిహీనుఁడితఁడు
సర్వభూతసమానవీక్షణుఁడితండు
భక్తురాలగు రుక్మిణి భర్తఁడితఁడు
సత్యమిది దాఁచనేటికో సత్యభామ!

సత్య—స్వామీ! మీరుచేసిన ప్రబోధమువలన నాచిత్తము నిర్మలమైనది. అభిమానరజ్జువు ఖండఖండములుగాఁద్రెంపఁబడినది కాని భక్తులకు భక్తుఁడితండని చెప్పియున్నావే ఆభక్తిసామర్థ్యము గొంచెముగనఁబఱచినచో నేను కృతకృత్యురాలనగుదును.

నార—మంచిమార్గము లోనికి వచ్చితివి. నీవిప్పుడు రుక్మిణి యొద్దకేగి యామెను శరణుబొందుము. భక్తిసామర్థ్యము ప్రత్యక్షముగనే చూడఁగలవు.

సత్య—(నమస్కరించి.) మహాత్మా! చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు)

(చ తు ర్థాం క ము.)

---



# శ్రీకృష్ణతులాభారము

పంచమాంకము.

—। తులసీమందిరము. ।—

(జాంబవతి, నాగ్నజితి, మిత్రవింద, లక్షణ, కాళింది, భద్ర, రుక్మిణి, ప్రవేశించుచున్నారు.)

రుక్మి—అద్యపూర్వోక్తైవంగుణ విశేషణవిశిష్టాయాం శుభతిథౌ అస్మాకం సహకుటుంబానాం శ్రీతులసీదేవతాప్రసాదసిద్ధ్యర్థం శ్రీతులసీదేవతాపూజాం కరిష్యే,

శ్లో॥ అంబ! త్వమమృతాజ్జాతా త్రిలోకానాం జననస్యసి।
తస్మాద్ధ్యాయామి కరస్థై రేఖిస్త్వాం తులసి త్రిభిః॥
శ్రీతులసీ దేవీం ధ్యాయామి।

శ్లో॥ తులసి! త్వత్ప్రసాదేన పురా సర్వేసురాసురాః।
ప్రాప్నువన్ విజయం తస్మాత్త్వాముద్యావాహయామ్యహమ్॥
శ్రీతులసీదేవీ మావాహయామి।

శ్లో॥ వజ్రవైడూర్యమాణిక్యఖచితం స్వర్ణనిర్మితం।
సింహాసనమిదం దేవి! తులస్యత్ర ప్రవిశ్యతామ్॥
శ్రీతులసీదేవ్యై రత్నసింహాసనం సమర్పయామి।

శ్లో॥ సుగంధిభిరమీభిస్తే జలైరర్ఘ్యం ప్రకల్పితం।

త్వయాతులసి! సానందం తదిదం ప్రతిగృహ్యతామ్‌॥
శ్రీతులసీదేవ్యా అర్ఘ్యం సమర్పయామి।

శ్లో॥ ఇదం పాద్యం సమానీతం త్వదర్థం తులసి స్వయం
అనేన క్షాళయామ్యద్య తవ పాదౌ ప్రసారయ॥
శ్రీతులసీదేవ్యై పాద్యం సమర్పయామి।

శ్లో॥ మధురం లఘు పానీయం సురభిశుభ్రం మనోహరం।
ఇదమాచమనీయం తే దీయతే దేవి గృహ్యతామ్‌॥
శ్రీతులసీదేవ్యా ఆచమనీయం సమర్పయామి।

శ్లో॥ దధిక్షీరాజ్యమధుభిర్యుక్తైరిక్షురసైర్యుతైః।
పంచామృతైరమీభిస్త్వాం తులసి స్నాపయామ్యహమ్‌॥
శ్రీతులసీదేవీం పంచామృతైః స్నాపయామి।

శ్లో॥ శుద్ధైః ప్రసాదసంపన్నైః మహానదిసముద్భవైః।
స్నాపయామి జలైరేభిః తులసి త్వం ప్రసీద మే॥
శ్రీతులసీదేవీం శుద్ధోదకేన స్నాపయామి।

శ్లో॥ చిత్రైశ్చిత్రైస్స్వర్ణవర్ణైర్భ్రాజమానం మనోహరం।
వస్త్రయుగ్మమిదం దేవి ధ్రియతాం తులసి స్వయం॥
శ్రీతులసీదేవ్యై వస్త్రయుగ్మం సమర్పయామి।

శ్లో॥ ముక్తామణిగణైర్యుక్తైః స్వర్ణవర్ణైస్సముజ్జ్వలైః
ఏభిరాభరణైర్దేవి త్వదంగం భూషయామ్యహమ్‌॥
శ్రీతులసీదేవీం మాభరణైర్భూషయామి।

శ్లో॥ మృగనాభిసమాయుక్తం కర్పూరాగురువాసితం
త్వదంగేషు సుఖాయాస్తామిదం తులసి చందనమ్‌॥

శ్రీతులసీదేవ్యై చందనం సమర్పయామి।

శ్లో॥ హరిద్రానతకా నేతాః స్వర్ణఖండానివోజ్జ్వలాన్
అర్పయామి తవప్రీత్యై గృహాణ తులసి స్వయమ్॥
శ్రీతులసీదేవ్యా అక్షతాన్ సమర్పయామి॥

శ్లో॥ అమీభిర్వివిధాకారైస్సుమనోభిర్మనోహరైః
సౌరభ్యకరిపూర్ణై స్త్వామర్చయామి మమాంబికే॥
శ్రీతులసీదేవీం పుష్పైః పూజయామి॥

నమజ్జనముకుటీమణికాన్తిసిరాజితపదాయాః పాదౌపూజయామి
సుకుమారగుల్ఫాయాః గుల్ఫౌపూజయామి ।
నాగహస్తోరోః ఊరూపూజయామి ।
కనక కాంచీకలాపాలంకృతకట్యాః కటింపూజయామి ।
సింహామధ్యాయా మధ్యంపూజయామి ।
పీనవక్షస్థలాయా వక్షస్థలంపూజయామి ।
లికుచకుచాయాః కుచౌపూజయామి ।
మృణాళభుజాయాః భుజేపూజయామి ।
పద్మహస్తాయా హస్తౌపూజయామి ।
చంద్రముఖ్యాముఖంపూజయామి ।
ద్వితీయాశశిలలాటాయా లలాటంపూజయామి ।
కంబుకంఠ్యాఃకంఠంపూజయామి ।
చంపకనాసికాయా నాసికాంపూజయామి ।
విశాలనేత్రాయా నేత్రేపూజయామి ।
శ్రీకర్ణాయాఃకర్ణౌపూజయామి ।
సుభ్రువోభ్రువౌపూజయామి ।
విభూషణాలంకృతమస్తకాయామస్తకంపూజయామి ।
తులసీదేవ్యాస్సర్వాణ్యంగానిపూజయామి ॥

శ్లో॥ నానాసుగంధద్రవ్యాణాం వ్యా మిశ్రీణముపేయుషా
ధూపేనాఘ్రాపయామి త్వాం తులస్యై తేనతుష్యతాం॥
శ్రీతులసీదేవ్యైధూపమాఘ్రాపయామి।
శ్లో॥ త్రైలోక్యతిమిరఘ్నేన ఘృతవర్తివిరాజతా।
అనేన దీపయామి త్వాం దీపేన తులసి స్వయం॥
శ్రీతులసీదేవ్యై దీపందర్శయామి।
శ్లో॥ సర్పిఃక్షీరగుడైర్యుక్తం పంచభక్ష్యైరిదంయుతం
నివేదయామ్యహంతుభ్యం తులసి ప్రతిగృహ్యతామ్॥
శ్రీతులసీదేవ్యై నైవేద్యం సమర్పయామి॥
శ్లో॥ ఏలాలవంగకర్పూరజాతిపూగీఫలైర్యుతం
నవంనవమిదం దేవి తాంబూలం చర్వ్యతాం త్వయా॥
శ్రీతులసీదేవ్యైతాంబూలం సమర్పయామి।
శ్లో॥ ద్వాదశాదిత్యసంకాశం ప్రభయా సంప్రభాతయా
కర్పూరనీరాజనం తే దదామ్యంబ ప్రసీద మే॥
శ్రీతులసీదేవ్యైకర్పూరనీరాజనంసమర్పయామి।
శ్లో॥ సాధనంసర్వకార్యాణాం త్వత్ప్రసాదస్యభాజనం।
మంత్రపుష్పమిదం దేవి తులసి ప్రతిగృహ్యతామ్॥
శ్రీతులసీదేవ్యైమంత్రపుష్పం సమర్పయామి।
శ్లో॥ అపరాధసహస్రఘ్నాన్ శ్రద్ధాభక్తిసమంచితాన్
ప్రదక్షిణనమస్కారా నర్పయామి మదంబికే॥
శ్రీతులసీదేవ్యైప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి।
శ్లో॥ మంత్రక్రియాయాంశ్రద్ధాయాం సర్వేషువిషయేషువా
మోహాద్యదతిమేలోపః సన్తుమ్యస్త్వయాంబికే॥
శ్రీతులసీదేవ్యై క్షమార్పణం సమర్పయామి।

అనేన చిదంబరేశ్వరకల్పోక్త ప్రకారేణ కృతయా పూజయా తులసీదేవీ సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు

కృష్ణార్పణమస్తు.

(అతఁ డుదకము విడుచును.)

సత్య—(పటాక్షేపముగాఁ బ్రవేశించి) అక్కా అక్కా! రుక్మిణీమహాదేవీ! నా ప్రయత్నమంతయు వ్యర్థమైనది. నాకిఁక నీవు దక్క వేఱొక దిక్కు లేదు. రక్షింపుము. రక్షింపుము. (పాదములపైఁ బడును.)

రుక్మి—(లేవనెత్తి) అయ్యో! సాధుని విడిపించుట కాలేదా? అమ్మా! ఇంత ద్రవ్యమును చాలకపోయినదా?

సత్య—అక్కా! ఇంక నెంత ద్రవ్యము వేసినను తట వంగునట్లు గన్పట్టదు.

రుక్మి—అమ్మా! సత్యభామా! ఈద్రవ్యమంతయు భక్తిభావముతో నుంచితివా? అభిమానముతో నుంచితివా?

సత్య—అక్కా! రెంటికిఁగల భేదమేమి?

రుక్మి—అమ్మా! తృణమునకుఁ గూడఁ గొఱగాని దేహమునందు నేను నేననెడి యహంభావము నారోపించుకొని కర్తృత్వాదితమోభిభూతులై సర్వమును నాచే నిర్వహింపఁబడుననియు నేనందఱిలో శ్రేష్ఠపదార్థమునననియు నాకు సమానమగు మఱియొక వస్తువు లేదనియు, నేనందఱిచేతను కోరఁదగి యుందుననియు, నేనైశ్వర్యాధికననియు, నేను సౌందర్యపయోనిధిననియు, తదితరులందఱు నాకుఁ గ్రిందివారనియు, నాకటాక్షప్రసారము లేనియెడల లోకము నిలువఁజాలదనియు, పరులగుణములయందసహనబుద్ధిచేతను తృణీకారబుద్ధిచేతను నిర్లక్ష్యబుద్ధిచేతను ధనలోలులై కామలోలులై పరవంచనప్రసక్తిగలిగి పరమార్థవిచారదూరులై దురాచారపరాయణులై కృత్యాకృత్యవి

పంచమాంకము,

శోకశూన్యులై వాచ్యావాచ్యము లనెఱుఁగక యొడలు తెలియక పాప
మత్తులగువారలవలె విపరీతేంద్రియులై మనమే శాశ్వతమనియు
మనవస్తువాహనాదిసంపదలు నిలలేనివనియు దైవముగూడ మనయా
జ్ఞకుఁగట్టుబడియుండుననియు నేనొకని బద్ధునిఁ జేయఁగలననియు నేనొకని
విముక్తునిఁ జేయఁగలననియు వీఁడు నావాఁడనియు వీఁడు పరుఁడనియు
నిట్టిపిచ్చితలంపులచేఁ బ్రవర్తిల్లుటయే యభిమానము. ఈయభిమానము
గలవారికిఁ బరమేశ్వరుఁడు తోడ్పడఁడు. వీరెంతెంత కార్యములు దలఁచి
చినను భగ్నములగుచుండునే కాని నిర్విఘ్నముగా నెఱవేఱఁజాలవు, ఒక
వేళ నేదోయొకటి నెఱవేఱినను మనవలన నీకార్యము నెఱవేఱినదను
దుర్బుద్ధిచే వీరు సంపూర్ణముగాఁ జెడిపోవుదురు. పరమేశ్వరుఁడాకించిత్స
హాయము నంగీకరించినను తెలిసికొనవలయును. అంతయే కాని తమసామ
ర్థ్యముచే నది నెఱవేఱినట్లు భ్రమపడఁగూడదు; ఇదియే దీనిరహస్యము.
ఇఁక భక్తిభావముఁ గూర్చి కొంచెము వినుము. తృణమునకును గొఱ
గాని యీదేహమువలన నొక్కప్రయోజనమును లేదనియుఁ బనికిమా
లిన యీదేహములయందుఁ గర్తృత్వాద్యభిమానములు నారోపించు
కొని మేము గొప్పవారమనియు మేము నీచులమనియు మేము ధనవంతుల
మనియు మేము దరిద్రులమనియు మేము బలవంతులమనియు మేము దు
ర్బలులమనియు మేము పుణ్యవంతులమనియు మేము పాపవంతులమనియు
మేము బాగుగ బ్రతికితిమనియు మేము చెడఁగొట్టితిమనియు నన్నందఱును
జేరొక్కొంకుఁడనియును నొక్కొక్కఁడను దలఁపెట్టఁడనియు నేను సమర్థుఁడనని
యు నేనసమర్థుఁడనియు నేను సుఖములననుభవింతుననియు నేను
దుఃఖములననుభవింతుననియు నాకేలోపములు లేవనియు నాకన్ని
యు లోపములేయనియు నున్నగు నిట్టిపిచ్చిసంతోషవ్యసనములలో
మునిఁగి తేలక మనకెల్లరకును నీశ్వరుండొకఁడు కలఁడనియు దేహాత్మబుద్ధి
గలజీవునకేనాఁడును స్వాతంత్ర్యము లేదనియు జీవుఁడు చేసెడికార్యము

లన్నియు నీశ్వరాధీనములైయున్నవనియు, మనము చేయుచున్నామను నభిమానముచేఁ జేసెడికార్యమొక్కటియును నిర్వహింపఁ జాలదనియుఁ గార్యాకార్యనిర్వాహణదక్షుఁడు పరమేశ్వరుఁడొక్కఁడేయనియుఁ దుచ్ఛములగు భోగములు మనకు శాశ్వతములుగావనియు మనహృదయకమలములచే సర్వదా పరమేశ్వరారాధనముఁ గావించుటకన్న మఱియొండు తరణోపాయము లేదనియు నిశ్చయించుకొని మనయుం గోరోపింపఁ బడిన సర్వభావములను బరమేశ్వరునియందుఁ బెట్టి దైవవశమున నెప్పటి కెయ్యదిప్రాప్తించునో యుక్తాయుక్తముల యెల్ల సమానముగా ననుభవించుచు బ్రహ్మానందమున నోలలాడుటయే భక్తిభావము. అమ్మా! ఈభక్తిభావము గలవారికిఁ బరమేశ్వరుఁడెల్లవేళలసహాయుఁడగుచుండు. పరమేశ్వరాధీనముగా వీరుతలపెట్టినకార్యము లెంతచేసినయు నిరంతరాయములుగా నెఱవేఱఁగలవు. అట్లు నెఱవేఱకున్నను తజ్జనితములగు ఫలాఫలములకుఁ గాని సుఖదుఃఖములకుఁ గాని పాత్రులుకానేరరు. ఇదియేదీనిరహస్యము.

సత్య—అక్కయ్యా! నేను నాథునివిడిపింతునను నభిమానముచేఁ బ్రవర్తించుచుండుటవలనఁ గాఁబోలు నాప్రయత్నమంతయు భగ్నమగుచున్నయది. అమ్మా! నీవు నాప్రార్థననంగీకరించి భక్తిభావముచే నాథుని విడుపింపుము. నేను కృతార్థనయ్యెద.

(పాదములపైఁబడును)

రుక్మి—అమ్మా! సత్యభామా! లెమ్ము లెమ్ము. నీవభిమానరహితవై తివిగావునఁ దరించితివి. రమ్ము పోదము. (తులసీపాత్రముఁదీసికొని) అమ్మా జాంబవతీ! మీరుఁదఱుగూడరండు నాథునిదర్శించి కృతార్థలమయ్యెదము. (ఆకాశమువలక్షించి)

శా॥ ఓనిత్యాత్మక! యోపురాణపురుషా! యోభక్తమందార! యో
జ్ఞానానందమయస్వరూప! జగదీశా! దేవచూడామణీ!

నానాలోకనిధానకుక్షికుహరా! నాథా! మనోనాథ! మా
యానిర్మాణచమత్క్రియానిపుణ! కృష్ణా! దీనసంరక్షణా!॥

(అందఱు పరిక్రమింతురు. యవనిక పడును.)

—♦ వి హా ర మం డ ప ము. ♦—

(నారదకృష్ణులు ప్రవేశింతురు.)

నార—భక్తపరాధీనా! కృష్ణా! జగన్నాటక సూత్రధారుఁడ వగునీమాయ యెవనికిని దెలియశక్యముఁగాదుసుమా.

శా॥ మాయాతీతుఁడవైన నీమహిమ మే ♦ మాత్రంబటం చెంతునో
శ్రీయఃప్రాప్తినిదానరూపకరుణా ♦ సింధూ! జగద్రక్షకా!
మేయామేయగుణానురూపవరిణా ♦ మా! స్వామి! కృష్ణా! నినున్
బాయంజాలకయుంటి నాకభయదా ♦ నంబున్ బ్రసాదింపవే.

కృష్ణ—నారదా! సమాధియోగమునందు సర్వదా స్వాత్మావలోకనానందప్రసారామృతంబున నోలలాడుచుండెడి నిన్ను నేనెకనాఁడు బాసియుంటినా?

నార—దేవా! అనంతకళ్యాణగుణ పరిపూర్ణస్వరూపుండవగు నిన్నుదర్శించిపకొలఁదియుఁ దనివితీరక నాహృదయమిట్లనుపించుచున్న దేకాని భక్తమానసనివాసివగు నిప్పు న న్నెడఁబాసితివని కాదు.

కృష్ణ—నారదా! అదిగో చూడుము! నీకతమున సుడుచూడఁ దగినవేడుకఁ జూచుచున్నాను.

నార—(పరికించి) ఓహో! సత్యభామ తోడికోడండ్రం దఱుతోఁగూడి వచ్చుచున్నట్లున్నది.

(రుక్మిణీసత్యభామాదులు ప్రవేశింతురు.)

రుక్మి—(తులసీపాత్రముం బట్టికొని)

శా॥ ఆనందంబు భవత్కథామృతలస ♦ ద్ద్వ్యాస్వాదభాగ్యంబు ని
త్యానందంబు భవద్గుణానుభవ సం ♦ ప్రాప్తప్రభాలోక మా
త్మానందంబు భవత్స్వరూపకలనా ♦ వ్యాపారసంగంబు బ్ర
హ్మానందంబు త్వదేకభావనము కృ ♦ ష్ణా! విశ్వసంరక్షకా!

కృష్ణ—నారదా! భక్తి పారవశ్యంబున రుక్మిణీవదనచంద్రబింబము నుండి వచ్చుచుండెడి యీవాక్సుధారసంబు సోఁకినంతనే నామేను పులకరించుచున్నదిసుమా?

నార—భక్తపరాధీనుఁడవగు నీకట్లుండుట సహజమేకదా? సత్యభామా! నీకోడికోడండ్రనందఱిని దోడికొనివచ్చితివా?

సత్య—(తలవంచుకొనుచున్నది)

నార—(అందఱినిఁజూచి) ఇంకనో ధైర్యమున్నవారు ముందుకురావచ్చును.

జాంబ—చెల్లెలా! లక్ష్మణా! నీకేమైన సామర్థ్యముకలదా?

లక్ష్మ—అక్కా! సత్యభామకన్న మనమెక్కువవారమా? ఆమెయొద్దనున్నద్రవ్యముకన్న మనయొద్ద నెక్కువద్రవ్యమున్నదా? మనద్రవ్యముగూడ నింతకన వినియోగింపఁబడియే యున్నదికదా? మనసామర్థ్యమంతయు నింకఁ దెలిసియేయున్నది. మనమీవిషయమున నొకమాటయాడుటకుఁగూడ నర్హులముగాము.

అందఱును—అదినిజమేనమ్మా! రుక్మిణీ! మేమందఱమునునీయందాశ పెట్టుకొనియుంటిమి. ప్రాణనాథునిదక్కించెదవో? నారదుని పాలుజేసెదవో? అన్నిఁటికిని నీవేసుమా?

రుక్మి—అమ్మా! నేనెందుకును పనికిమాలినదానను. నేనీకార్యము నెఱవేర్తునని యెన్నఁటికిని బూనుకొనను. నాయందు కర్తృత్వ మేమియును లేదు. ఈశ్వరప్రసాదమే యన్నింటికిని ప్రధానము. పరమేశ్వరసంకల్పమెట్లున్నదో యట్లుకాఁగలదు. మీయాజ్ఞ పరిహరణీయము

కాకపోవుటచే నేను నిమిత్తమాత్రముగా నీకార్యములో దిగవలసి వచ్చినది. కాని వేరొకటి కాదు. అమ్మా! సత్యభామా! తులలోనిప దార్థమంతయు దీయింపుము?

సత్య—(పదార్థమంతయును దీయించును.)

రుక్మి—(నారదకృష్ణులకు ప్రదక్షిణముగావించి తులయెదుట నిలువఁబడి చేతులుజోడించి)

శా॥ నాకర్తృత్వమొకింతలేదిచట నా ♦ నాలోకసంరక్షణా!
నీకారుణ్యకటాక్షవీక్షణముగన్ ♦ విశ్వంబులెల్లన్ బహి
ర్వ్యాకోచంబు వహించు నొక్కయెడ ని ♦ ర్వ్యాకోచతంగాంచు నే
డీకార్యంబును జేయుచేయుకుము నీ ♦ వే సుమ్ము సర్వేశ్వరా!

(తులపైని దులసీదళము నుంచుచున్నది. తులసమానముగాఁ దూఁగుచున్నది. పుష్పవృష్టి మంగళధ్వనులు.)

నార—(తులసీదళముందీసికొని కనులకద్దికొని.)

సీ॥ ఇదిగదా యోగవిద్హృదయపంకేరుహ
మధ్యస్థిత ప్రభామండలంబు
ఇదిగదా సంసారవిదళనప్రక్రియా
దీక్షానముజ్జ్వలద్దివ్యశక్తి
ఇదిగదా సంతతాభ్యుదయసంపాదన
కౌశల్యదీపిత కల్పతరువు
ఇదిగదా వైకుంఠపదసమారాధన
భాగ్యప్రదాయక భావుకంబు
గీ॥ ఇదిగదా సాధులోకసమ్మదవిధాన
మిదిగదా సచ్చిదానందసదనభూమి
ఇదిగదా భాగవత మహాభ్యుదయసార
మిదిగదా పారమార్థికపదము మాకు॥

సత్య—(రుక్మిణీకృష్ణనారదులకుఁ ప్రదక్షిణనమస్కారములు గావించి జాంబవతీప్రముఖులతోఁగూడ మంగళారతి నిచ్చుచున్నది).

నార — (నాట్యము చేయుచు)

— (గేయము.)

యోగరతుండో భోగరతుండో
సంగరతుండో సంగచ్యుతుఁడో
ఆత్మారతుం డెవఁడగునో వానిదె
యానందము బ్రహ్మానందము రా॥ భజ॥

(నిష్క్రమించుచున్నాఁడు)

కృష్ణ — సత్యభామా! అభిమానరాహిత్యమునఁ బ్రవర్తించుటకే కార్యమీవిధముగా నిర్వర్తింపఁబడినది. నీకేమివరము గావలయునో కోరుము.

సత్య — దేవా! మీయనుగ్రహమువలన నేను కృతార్థురాలనైతి. నాకు మనోరథములన్నియుం దీరినవి. నాకింకఁ గావలసినవరమే మున్నది. ఐనను నిట్లగుఁగాక.

భరతవాక్యము.

ఉ. నీ కరుణాకటాక్షమున ♦ సత్యము సచ్చరిత్రప్రీతియుక్తనై
లోకము మాన్య భావముల ♦ లోఁబడిపోవక యుండుఁగాక ని
ర్వ్యాజపు భావ మేర్పడ మ ♦ హాత్ములు తావకదర్శనంబునం
జేకొనుచుండ్రుఁగాక భువిఁ ♦ జేకుఱుఁ జాలని మోక్షసౌఖ్యముల్.

(అందఱు నిష్క్రమింతురు)

గద్య.

ఇది శ్రీభారద్వాజసగోత్ర సీతారామపుత్ర కనకాంబా
గర్భశుక్తిముక్తాఫల పరమేశ్వరప్రసాద
సముపలబ్ధగీర్వాణాంధ్రకవనమాధుర్య
చిదంబరకవివర్య ప్రణీతంబగు
శ్రీకృష్ణతులాభారమను
నాటకమున సర్వమును
పంచమాంకము
సంపూర్ణము

---

# సావిత్రీ చరిత్రము

(గ్రంథకర్త:—ఆదిభట్ల నారాయణదాసుగారు)

ఈకృతికర్త సంగీతమునం దెంత ప్రజ్ఞగలవారో సాహిత్యమునం దంత ప్రజ్ఞగలవారు. వీరియంతటి భరతశాస్త్రప్రవీణులు, వీరికన్న మించిన స్వరజ్ఞానముగలవారు; మృదంగాది వాద్యములు వీరికి నల్లేరుపై బండినడక, వయోవృద్ధులు; స్వయముగ సభారంగమున నిలిచి చవులూరమాధుర్యముగ వారికథ చెప్ప నేర్తురు. ఈసావిత్రీచరిత్రమున వీరిప్రతిభయంతయు వెల్లడియగుచున్నది. దీనితరువాతనే ఇవ్వలనాటకములు వెలసినవి. ఇందలివర్ణనలే తరువాత వెలసిన సావిత్రీరూపకములం జర్వితచర్వణములైనవి. వర్ణనలతిస్వభావసిద్ధములై యొడలు జల్లురనజేయును. ప్రతిపాటకును దానిరాగము చివర నుదహరింపఁబడినది. ప్రతికృతిని చదువరులకన్నులకు కట్టెదుటఁగాఁజూపఁగల రసవత్తమ పద్యములు! నాల్గవకూర్పు ప్రతులయి పోవచ్చినవి. త్వరపడుఁడు.

వెల, 0—1—0

# అనుభవగృహవైద్యము

(గ్రంథకర్త:—గ్రంధి సుబ్బరాయగుప్తగారు.)

శాస్త్రమునకు అనుభవమునకును చాలతారతమ్యముగలదు. శాస్త్రోక్తమైన దనుభవమున తలక్రిందుకావచ్చును. కాని యనుభవసిద్ధమైనది శాస్త్రోక్తము కాకపోదు. ఇది అనుభవగృహవైద్యము. అనగా తేటతెనుగుమాటలతో నన్నియు మనకు లభించుదినుసులతో ఇంటిలోవచ్చు సర్వరోగములకు వైద్యుని యవసరము లేకుండ చంటిపిల్లలుగూడ వైద్యము నిరపాయముగఁ జేసికొనగల చక్కని గ్రంథము. ఇట్టిగ్రంథ మిదివఱకు లేదు. ఈగ్రంథమింటిలో నున్నచో వైద్యులకొఱకు వెచ్చించు వేలకువేలరూపాయలాదా యగును. 1 రూపాయితో ననుభవవైద్యంపు లభించినప్పుడే తరుణమును మీరేల పోఁగొట్టుకొందురు. ఇప్పుడే యొకగ్రంథమునకు వ్రాయుఁడు.

వెల. 1—0—0

వలయువారు— కందుల గోవిందం.

జనరల్ బుక్కుడిపో, బెజవాడ.

# మహాభారత నాటకము

ఇది

(గ్రంథకర్త—సంపన్నుమంబసింగరాచార్యులు.)

రాయల్ సైజులో నందముగ ముద్రింపఁబడిన గొప్పనాటకము—పార్సీప్లాటు ననుసరించి మంచిపాటలతో రచింపఁబడినది. ప్లాటుమహావిచిత్రముగ నుండును. చదివి తీరవలసిన గ్రంథము—పద్యమొక్కటియే—విశేషమూల్యము గలదిగా నున్నది. ఇట్టి గ్రంథమూల్యము లెక్కయేమి? ఇందలి గాథలు.

(1) ధర్మరాజు రాజసూయము—శిశుపాలవధ (2) శకునిదుర్యోధనునకుదుర్బోధనలు చేయుట (3) పాండవులను కౌరవులు మాయాదురోదరంబున నోడించి పాంచాలీ మానభంగము చేయఁదలంచుట; శ్రీకృష్ణుఁడక్షయచేలములనిచ్చి రక్షించుట, (4) సత్యభామ మగనివశముచేసికొనుటకు ద్రౌపదిని మందడుగుట, ఆమెపాతివ్రత్య ధర్మముల నుపదేశించుట, (5) నందుడు దుర్యోధనసేవకై రాబోవుచుండ సాధువులెదురగుట, అతఁడు సాధుసేవకై చనుట; (6) నందునకు బదులుగ శ్రీకృష్ణుఁడావేషమున దుర్యోధనసేవ చేయుట—నందదుర్యోధనుల విస్రంభసంభాషణము. నందునిమోక్షప్రాప్తి (7) రెండవమారు ధర్మజుని కౌరవులు రాజ్యభ్రష్టునిఁజేసి యడవులకంపుట—శ్రీకృష్ణుఁడు ద్రౌపదిని భీష్మునివద్దకుఁ గొనిపోవుట. (8) భీష్మదుర్యోధన సంవాదము. (10) శివుడను మాలవానిభక్తి—మాలవానివలన నాయమైలపడెనని బ్రాహ్మణులవాదము—శివుఁడుభక్తి ప్రదర్శనముచేయుట. (11) కృష్ణుఁడర్జునునకు భీష్మవధోపాయము చెప్పుట—(12) భీష్ముని అంపశయ్య—(13) సీతారాముఁడను పంచముని ద్రోణుడు బ్రాహ్మణజాతిగర్వమున నిరాకరించి వంచితుఁడగుట, (14) అశ్వత్థామ, ఉపపాండవుల సంహరించుట. (15) పాండవుల మహాప్రస్థానము.

వెల రు 1—4—0

వలయువారు.

కందులగోవిందం.

జనరల్ బుక్కుడిపో, బెజవాడ.

